# ఆవాహన

డా॥ ముదిగొండ శివప్రసాద్

'విజయ' అనుబంధ మాలికలో
వెలువడ్డ ఇరవైయ్యవ నవల

విజయ
80. ధనలక్ష్మి కాలనీ
మద్రాసు-26

విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 21
AUGUST 1977
'AAVAAHANA'
MUDIGONDA SIVAPRASAD

ముఖచిత్రం : గంగాధర్

వెల : చెల్లింపలేనిది
(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
ఇవ్వబడ్డ అమూల్య కానుక)



ప్రింటర్స్ :
విజయా గ్రాఫిక్స్,
8. ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

డా॥ ముదిగొండ శివప్రసాద్

"ప్రియమైన రామచంద్రా!

ఇక్కడ అంతాక్షేమం. అక్కడ మీ క్షేమసమాచారములు వ్రాయగోరుతాను. నాకు వరంగల్‌కు ట్రాన్స్‌ఫర్ అయింది. బ్యాంక్ హనుమకొండలో వుంటుంది. అందుకని అక్కడ నాకొక ఇల్లు చూడు. విశేషాలన్నీ స్వయంగా చెపుతాను. నీ జాబు అందినవెంటనే సామాను ఒకలారీమీద వేసుకొని వస్తాను. ఊరు నాకు కొత్త. ఎన్నడూ వరంగల్ రాలేదు. ఊళ్ళో నీవు తప్ప వేరే తెలిసినవాళ్ళూ లేరు. అందుకని పూర్తిగా నీ సహాయం తప్పనిసరి. జవాబు రాయి.

ప్రేమతో నీ మాధవ్."

మాధవరావు రాసిన ఆ వుత్తరం రామచంద్రరావుకు అందిన వెంటనే ఇంటికోసం వేట ప్రారంభించాడు. ఏనుగులగడ్డ సందులో ఓ ఇల్లు ఖాళీగావుంది. అన్నివిధాలా వసతిగావుంది. వెంటనే రామచంద్రరావు అడ్వాన్సు ఇచ్చి, కిరాయి 'పక్కా' చేసుకున్నాడు. అడ్వాన్సు ఇవ్వగానే మాధవరావుకు జాబురాశాడు. మాధవరావు దగ్గరనుండి మళ్ళీ జాబువచ్చింది.

"రామ్!

నీ జాబు అందింది. ఇల్లు నాకు నచ్చుతుందో లేదో ఆ

రాశావు, నీవు నా కళ్ళతో చూడగలవని నాకు తెలుసు. సోమవారం సాయంత్రం గోల్కొండకు వస్తున్నాను. కాజీపేటకు రా!

ప్రేమతో నీ మాధవ్"

రామచంద్రరావు కాజీపేటకు వెళ్ళాడు.

ట్రైన్ సకాలంలోనే వచ్చింది.

రైలులోనుంచి మాధవరావు, లక్ష్మి, వాళ్ళ మూడేళ్ళపాప ఇందిరా దిగారు.

రామచంద్ర, మాధవ్‌ను కౌగలించుకున్నాడు.

"అరే, రామ్! ఇంత చిక్కిపోయావేరా?" అన్నాడు మాధవరావు.

"ఈ వూళ్ళో అంతే! నీళ్ళు చిక్కవు. పాలు చిక్కవు. అందుకే మేము 'చిక్కని పాలు' అంటాం! అంటే- దొరకని పాలు అని అర్థం. చిక్కేదంతా మనుషులే."

రామచంద్రుని చమత్కారానికి లక్ష్మి నవ్వింది.

"నవ్వినట్లుకాదు. బేసిక్ ప్రాబ్లమ్స్‌పున్నాయట ఈ వూళ్ళో. చూచుకోమరి" అన్నాడు మాధవరావు భార్యతో.

"మా చెల్లెలికేం సమస్యలేరా? నేను లేనా శ్రీకృష్ణుడిలాంటి అన్నయ్యను. ఏదైనా కష్టంవస్తే చక్రం అడ్డువేయనూ" అని—

"నీకేం భయపడకమ్మా! వూళ్ళో నల్లాలు బందయితే నీ కోసం హుస్సేన్‌సాగర్‌నుంచి తెప్పిస్తాం" అన్నాడు రామచంద్ర రావు లక్ష్మితో.

రామచంద్రరావు మాటకారి.

మాటలకు తోడు మంచితనంకూడా వుంది. అందుకే హైదరాబాదులో రామచంద్రరావు కుటుంబం, మాధవరావు కుటుంబం అంతగా కలిసిపోయారు, రక్తబంధువులు కాకపోయినా!

రామచంద్రరావు లెక్చరర్, ఏడాదిక్రితం హైదరాబాదునుంచి వరంగల్‌కు ట్రాన్స్‌ఫర్ అయివచ్చాడు.

ఏడాదిలో తీగలా హనుమకొండ, వరంగల్‌లో మొత్తం అల్లుకుపోయాడు తన మంచితనంతో.

మాధవరావు సామానులన్నీ లెక్క జూసుకుంటున్నాడు. ఈలోగా రామచంద్ర టాంగా మాట్లాడాడు.

కాజీపేటనుండి హనుమకొండ చౌరస్తాకు మూడు రూపాయలు.

అంతా టాంగా ఎక్కారు.

టాంగా పోతున్నది.

ఫాతిమానగర్, సిద్ధార్థనగర్, ఇంజనీరింగ్ కాలేజి, సుబేదారి, నక్కలగుట్ట....

"అబ్బా- ఇదేం రోడ్డురా! మొదలు చివరా లేకుండాపోతున్నది" అన్నాడు మాధవరావు.

"అవును. ఇది మాకు బ్రహ్మాస్వరూపం!! ఉన్నది ఇదొక్కటే రోడ్డు. ఇది తప్ప వేరేమీలేదు. ఇక్కడ కాజీపేటలో మొదలై ఓ పదిమైళ్ళు అలాసాగి, వరంగల్ స్టేషనుదగ్గర ముగుస్తుంది. ఈ రోడ్డుకే మేము జంటనగరాలు అని పేరుపెట్టాము. ఇటు హనుమకొండ, అటు వరంగల్."

టాంగా కిషన్‌పురా దాటింది.

"మాధవ్! నేనిక్కడే వుంటానురా. ఆ బ్రిడ్జిలేదూ దానికవతల మేనేజరమ్మగారి కాంపౌండ్‌దగ్గర."

"మరి మా ఇల్లెక్కడ చూచావు?" మాధవరావు అడిగాడు.

"చౌరస్తాలో. ఎందుకంటే నీకది బ్యాంకుకు దగ్గర. నాకిది కాలేజీకి దగ్గర."

టాంగా హాస్పటల్‌దాటి ముందుకుపోతున్నది. మాధవరావు వింతగా చూస్తున్నాడు వూరును. వస్తున్న ప్రతిబిల్డింగునూ, షాపునూ శ్రద్ధగా గమనిస్తున్నాడు.

చౌరస్తావచ్చింది. టాంగా కుమారపల్లి రోడ్డునుండి తిరిగింది. రామచంద్రరావు మాధవరావు కుటుంబాన్ని ఏనుగులగడ్డలోని నూతన గృహంలో ప్రవేశం చేయించాడు.

లక్ష్మికి ఇల్లు తొలిచూపులోనే నచ్చింది.

సామాన్లు లోపల సర్దేశారు. అప్పటికే సాయంకాలందాటి చీకటిరేఖలు వ్యాపించాయి.

"ఈ పూట మా ఇంట్లో భోజనం!" అన్నాడు రాం.

"వద్దన్నయ్యా! నేను వస్తూ పూరీ, కూరా తెచ్చాను" అన్నది లక్ష్మి.

రామచంద్రకు కోపం వచ్చింది.

"లక్ష్మి! వాడు ఫీల్ అవుతాడు. పద పోదాం" అన్నాడు మాధవరావు.

తాళంవేసుకొని అంతా కిషన్‌పురా బయలుదేరారు. ఓ పది నిమిషాల్లో కిషన్‌పురా చేరారు.

కాత్యాయని వీళ్ళకోసమే ఎదురుచూస్తున్నది.

రాగానే లక్ష్మిని కౌగలించుకుంది.

"అరే! ఇందిర అప్పుడే ఎంత పెద్దదైందీ!" అని పాపను ముద్దాడింది. ఆ మాటా ఈ మాటా చెప్పుకున్నారు.

అంతా భోజనాలకు కూర్చున్నారు.

"ఈ వూళ్ళో చూడవలసిన విశేషాలు ఏమిటి?" అని అడిగాడు మాధవరావు.

"నల్లాలు" అన్నాడు రామచంద్ర.

"అవి చూడడానికి అందంగా వుంటాయి. లోపలినుంచి నీళ్ళు మాత్రం రావు" అన్నాడు మళ్ళీ.

"చాల్లెండి. ఎప్పుడూ తమాషాయే మీకు" అంది కాత్యాయని.

"వేయిస్తంభాల గుడివుంది. అది మీ ఇంటికి దగ్గరేననుకో. రోజూ వెళ్ళి చూచినా చూడవచ్చు" అన్నది.

"రోజూ ఏం చూస్తాం? ఒకసారిచూస్తే చాలు" అన్నది లక్ష్మి.

"ఆc ఇంకా?" అని అడిగాడు మాధవరావు రసాల మామిడి పండును జుర్రుతూ.

"ఇంకా, పద్మాక్షిగుడి వుంది. అదీ మీ ఇంటికి దగ్గరే. భద్ర కాళిగుడి వుంది....తర్వాత ఖిల్లా వుంది. ఖిల్లాదగ్గరే స్వయం భూదేవాలయం వుంది. ఆజంజాహీ హిల్స్ వుంది."

"అరేయ్. నేనింతవరకు ఆజంజాహీ హిల్స్ చూడనే లేదురా" అన్నాడు రాం.

"ఎందుకని?"

"ఎందుకంటే టూరిస్టులు గబ గబా ఒకటి రెండు రోజుల్లో అన్నీ చూచి వెళ్ళిపోతారు. వూళ్ళో వాళ్ళు. 'ఆఁ-చూడవచ్చులే ఎప్పుడైనా' అని నిర్లక్ష్యంచేస్తారు. కొన్నాళ్ళకు 'ఆఁ- చూచేదేమిట్లే' అని మానేస్తారు, పెరటిచెట్టు ఎందుకూ కొరగానట్టు" అన్నాడు రాం.

"ఈయనెప్పుడూ తీసుకెళ్ళలేదు. కాని ఈ చుట్టుపక్కల చాలా చూచే విశేషాలున్నాయి లక్ష్మీ! జఫర్‌గడ్ అని ఒక ప్రాచీన పట్టణంవుంది. పాలకుర్తి అని మరో వూరువుంది. పాల్కురికి సోమనాథుని జన్మస్థలమది. ఆ దోవలోనే బమ్మెర గ్రామంవుంది. పోతనగారి జన్మస్థలం అది. అక్కడ పోతన్నగారు భాగవతంరాసిన గంటం కూడా వుందిట!"

"ఏమండీ! మళ్ళీ మనకు ట్రాన్స్ఫర్ అయ్యేలోపల ఈ వూళ్ళనీ ఒక్కొక్కటే చూడాలి" అన్నది లక్ష్మి ఉత్సాహంగా.

"ఇంతేనా. ఇంకా చాలా వున్నాయి. కొరివి అని ఒకగ్రామం వుంది. అందులో పెద్ద వీరభద్రుని విగ్రహంవుంది. అదికాక కొలను పాక అని ఒక ప్రాచీన క్షేత్రంవుంది ఈ సమీపంలోనే. అక్కడ రెండువేల సంవత్సరాలకు పూర్వంనాటి దేవాలయం వుందట. పాకాలవద్ద ఓ పార్కువుంది. అదీ చూడదగ్గదే!"

"ఆహాఁ! అయితే లిస్టుతయారుచేసి పెట్టుకున్నావన్నమాట!" అన్నాడు రామచంద్రరావు మజ్జిగపోసుకుంటూ.

"ఏం చేయను? చూడకపోయినా తెలుసుకొనైనా సంతోషించాలికదా! అయినా ఇంక ఊరుకోనులెండి. మా అన్నయ్యను తీసుకొని, నేనూ లక్ష్మి వెళ్ళి అన్నీ చూచివస్తాం" అన్నది కాత్యాయని.

"అవునురా. నీవు చరిత్ర పరిశోధకుడివి. ఇవన్నీ చూడాలని పించలేదా?" అన్నాడు మాధవ్.

"అనిపించడమేమిటి? చూశాను. పరిశోధించానుకూడా. కాని చూపించాలనిపించలేదు" అన్నాడు రాం.

"చూడండి ఎంత స్వార్థమో!" అన్నది కాత్యాయని కోపంతో.

"స్వార్థమేమిటి? ఇవ్వాళ జఫర్‌గడ్ అంటావు. రేపు ఏటూరి నాగారం అడవుల్లోకి పోదాం పదమంటావు."

"వింటున్నారా ఈయన మాటలు. నేను అడవుల్లోకి తీసుకు పొమ్మంటానట! ఈ ఇల్లే ఓ పెద్ద అరణ్యం. అందులో మీరో పులి, నేనో లేడిని" అన్నది కాత్యాయని.

"అమ్మా! కాత్యాయనీదేవీ! మీ అన్నయ్య వచ్చాడు నిన్ను ఆదుకునేందుకు ఈ పులినుండి" అన్నాడు రాం.

"అరెరే! మీరిప్పుడు దెబ్బలాడుకోకండిరా బాబూ! మీకు పుణ్య ముంటుంది. మనం ఒకలాచేద్దాం. ప్రతి ఆదివారం ఆఫ్. ఒక్కోసారి ఒక్కో విశేషంచూచి వద్దాం" అన్నాడు మాధవ్.

లక్ష్మికి హుషారువచ్చింది. "అంతే. నేను ఏ, గారెలో పాయసమో చేస్తాను. కాత్యాయని వెజిటబుల్ పలావ్ కానీ, కొబ్బరి అన్నం కానీ చేస్తుంది. అంతా వెళ్ళవచ్చు పిక్నిక్‌లాగా" అన్నది.

ఈ సూచనకు రాం కూడా ఆమోదాన్ని తెలిపాడు.

భోజనాలు ముగిశాయి.

రాం వాళ్ళను ఇక్కడే పడుకోమన్నాడు.

"లేదు. ఈ రాత్రే కొత్త ఇంట్లో నిద్రచేస్తాం. ముహూర్తం బాగుంది" అన్నాడు మాధవ్.

రాం రిక్షా మాట్లాడి మాధవ్‌ను, లక్ష్మినీ, పాపను అందులో ఎక్కించాడు.

ఓ పదినిమిషాల్లో కొత్తఇంటికి చేరారు మాధవరావూ, లక్ష్మీ.

ఆ రాత్రి మాధవరావుకు నిద్రపట్టలేదు.

ఏమిటేమిటో కలలు-

కలలో కాకతీయులూ, గణపతిదేవుడూ, రుద్రమదేవీ కన్పించారు.

తెల్లవార్లూ అటూ ఇటూ మసులుతూనే వున్నాడు. మర్నాడు సామానుతో లారీ వచ్చింది.

మాధవ్ ఆఫీసుకుపోయి రిపోర్టు చేసాడు.

మేనేజర్ చంద్రశేఖరం మాధవరావుకు పరిచయస్థుడే!! ప్రేమతో ఆదరించాడు.

కొత్త ఎకౌంటెంట్‌ను స్టాఫుకు పరిచయం చేశాడు. ఆ సాయంత్రమే మాధవరావుకు మేనేజర్ ఓ పార్టీ కూడా యిచ్చాడు.

ఓ నాలుగైదు రోజుల్లో మాధవరావు, లక్ష్మి ఇంటినంతా సర్దుకోగలిగారు.

పని మనిషీ, పాలూ అన్నీ కుదుర్చుకున్నారు.

రోజూ సాయంత్రం కాత్యాయని కాని, రాం కాని వచ్చిపోతూ వున్నారు.

ఒకనాడు సాయంత్రం రామచంద్రరావు బ్యాంకుకు వచ్చాడు. ఆఫీసులోంచి మాధవ్ బయటకు వచ్చాడు. ఇద్దరూ హోటల్లో కాఫీ రాగారు.

"రేపు ఎగ్జామినేషన్ బ్రాంచిలో పనిమీద హైదరాబాద్ వెళు తున్నాను. శనివారం సాయంత్రానికి తిరిగి వచ్చేస్తాను. ఈ ఆది వారం ఖిల్లా ప్రోగ్రాం. కాత్యాయని చెప్పమన్నది." అన్నాడు.

"ఓ.కే." అన్నాడు మాధవ్.

"రా, రా! ఇంటికి పోదాం." అని మాధవ్ రామచంద్ర రావును పిలిచాడు.

"లేదు. అర్జంటుగా మళ్ళీ ఇంటికి పోవాలి. రేపు ప్రయా ణంగా- అందుకని డబ్బుకోసంవచ్చాను బ్యాంక్‌కు. ఇంకా మార్కుల లిస్టు పూర్తికాలేదు." అన్నాడు రాం.

కాఫీ తాగాక రామచంద్రరావు మళ్ళీ కిషన్‌పురా ముఖం పట్టాడు.

మాధవరావుకు వెంటనే యింటికి పోబుద్ధిపుట్టలేదు.

ఎక్కడి కెళ్ళదాం అని ఆలోచించాడు.

దగ్గరే వేయిస్తంభాల గుడి వుంది.

చౌరస్తానుండి ఫర్లాంగు దూరం లోపలే వుంది.

హుషారుగా నడుచుకుంటూ మాధవరావు గుడివైపు బయలు దేరాడు.

నాలుగు నిమిషాల్లో గుడి వచ్చింది.

గుడిని చూచి తిరిగిపోతున్న కొందరు టూరిస్టులు మాధవ్‌కు ఎదురు వచ్చారు.

ముందుగా గుడి గోపురం కనబడింది.

మాధవ్‌లో ఉత్సాహం పొంగిపొర్లింది.

గబ గబా నడిచి మెయిన్‌గేట్ వద్దకు పోయాడు.

తలుపులు త్రోసి లోపలికి ప్రవేశించాడు.

ముందు ఖాళీ స్థలం—

అవతల దేవాలయం.

దేవాలయమంతా స్థంభాకృతిలో వుంది.

మాధవ్ అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకు పోయాడు.

ఓ కొలను వచ్చింది.

దాని పక్కనే ఓ పెద్ద శిలాశాసనం వుంది.

శాసనం మీద తెలుగు అక్షరాలే వున్నాయి.

కాని మాధవ్ చదవలేక పోయాడు ఆ లిపిని.

శిలాశాసనం నుండి మళ్ళీ పడమరకు మళ్ళాడు.

ఎదురుగా పెద్ద నంది కనిపించింది.

ఉత్తర దిశగా ముఖం పెట్టివుంది నంది.

దానిమీది శిల్పం అపురూపంగా వుంది.

మాధవరావు పరవశుడైనాడు!

నందికి ఎదురుగా శివాలయం వుంది.

కొందరు యాత్రికులు లోపలికి వెళ్ళి వస్తున్నారు.

మాధవరావు చెప్పులు విప్పి, లోపలికి వెళ్ళాడు.

ముందు వెడల్పాటి మండపం.

దానికి మూడు వైపులా మూడు గర్భగుడులు.

తూర్పు ముఖంగా వున్న గర్భగుడిలో శివలింగం వుంది.

అక్కడ పూజారి కూడా వున్నాడు.

మాధవరావు కానుకవేసి, స్వామికి నమస్కరించాడు. ఆలయ స్థంభాలమీద డిజైన్లు, సన్నటి లతలు చూస్తూ అనుకున్నాడు, "రాం వెంట వుంటే బాగుండును. ఈ శిల్ప రహస్యాలు వివరించేవాడు" అని—

అక్కడినుండి ఇవతలకి వచ్చాడు, మళ్ళీ నంది దగ్గరకు. నంది వెనుక ఇంకో దేవాలయం వుంది.

మాధవరావు అక్కడికి వెళ్ళాడు.

అందులో కొంత భాగం శిథిలమై వుంది.

మరికొంత యింకా అసంపూర్ణంగా వుంది.

'ఏ కారణం చేతనో కాకతీయులు ఈ మంటపాన్ని పూర్తి చేసినట్లు లేదు ఆ రోజుల్లోనే' అనుకున్నాడు మాధవరావు.

ఇంకొంచెం ముందుకు పోయాడు.

అప్పటికే సూర్యాస్తమయమైంది.

ఆలయమంతా తెల్లని వెలుగులతో నిండివుంది. టూరిస్టు లంతా వెళ్ళిపోతున్నారు ఒక్కొక్కరే! శిథిలమంటపంలో ఎవరూ లేరు మాధవరావు తప్ప!

ఆ మంటపంలో శిలలనూ, వాటిపై శిల్పాలనూ, లతలనూ జాగ్రత్తగా పరిశీలిస్తూ ఇంకొంచెం ముందుకు పోయాడు.

అక్కడొక నర్తకి బొమ్మ వుంది!

ఆ బొమ్మను చూస్తూ మాధవరావు అలాగే నిలబడిపోయాడు.

ఎందుకో ఆ బొమ్మను చూడగానే మాధవరావు శరీరం గగుర్పొడిచింది.

కళ్ళవెంట నీళ్ళు కారాయి.

ఏమి శిల్పమది?

ఎంతటి రమణీయ సజీవ చిత్రణం??

మాధవరావు ఆ బొమ్మ ముందు తానూ ఒక రాతి బొమ్మలా చలనం లేకుండా నిలబడి పోయాడు.

అలా ఎంతసేపు నిలబడ్డాడో తెలియదు.

ఇంతలో చంద్రోదయమైంది.

వైశాఖ పూర్ణమి!!

పుచ్చపువ్వులా చంద్రుడు వెలిగిపోతున్నాడు ఆకాశంలో.

"ఏమిటి చూస్తున్నావు?" ఎవరో మాధవరావును పలకరించారు.

మాధవరావు ఉలిక్కిపడి వెనుదిరిగి చూచాడు.

శిథిల మంటపంలో ఒకామె ప్రక్కన కూర్చొని వుంది.

మాధవరావు ఆమె వైపు విచిత్రంగా చూచాడు. ఆమె కిలకిలా నవ్వింది.

అది నవ్వులా లేదు. ఏదో జలపాతం ప్రవహించినట్లుంది.

"మీరు ఎవరు?" మాధవరావు యాంత్రికంగా అడిగాడు.

అప్పటికే ఆలయం పూర్తిగా నిర్మానుష్యమైంది.

ఈమె టూరిస్టా? లేక....

"నేను మీ అమ్మగారి సేవకురాలిని" అన్నదామె వ్యంగ్యంగా.

మాధవరావు ఆమె కళ్ళలోకి చూస్తున్నాడు.

అవి ధగ ధగ మెరుస్తున్నాయి.

"కూర్చో" ఆజ్ఞాపించినట్లుంది ఆ కంఠస్వరం.

మంత్రముగ్ధమైన భుజంగంలా మాధవరావు అలాగే కూర్చు న్నాడు ఆమె ముందు.

ఆమె పైటచెంగు గాలికి రెప రెప లాడుతున్నది, మాధవ రావుకు అంటీ అంటకుండా.

ఆమె సున్నితంగా కాళ్ళు జాపుకుని మోకాళ్ళపై రెండు చేతులు ఆనించుకొని కూర్చున్నది.

చేతుల గాజులు మెరుస్తున్నాయి.

మెడలో బంగారు నగలు.

ముఖం కోలగా వుంది.

సున్నితమయిన పెదవులు, మృదువైన బుగ్గలు, చిన్ని నోరు, గాలికి రేగే ముంగురులు.

"మీరు ఎక్కడ వుంటున్నారు?" మాధవరావు అడిగాడు. చాలా మెల్లగా పెదవులు కదిలీ కదలకుండా.

"ఈ గుడికవతల మోహరివాడలేదూ, అక్కడే మేం వుంటున్నాము." మేం అన్న మాటను వ్యంగ్యంగా అన్నది.

ఓహో! గుడి పక్కనే ఈమె ఇల్లన్నమాట. అందుకే, ఇంత నిర్భయంగా కూర్చున్నది చీకటి పడ్డా ఇక్కడ!!

మాధవరావు ఆమె సౌందర్యానికి మాత్రం ముగ్ధుడయి పోయాడు. నోటివెంట మాటలు రావడంలేదు.

ఏమి మాట్లాడితే ఆమె వెళ్ళిపోతుందోనన్న భయం. అందుకే అలాగే కూర్చున్నాడు.

ఆమె మళ్ళీ పలకరించింది.

"ఎప్పుడు వచ్చావిక్కడికి?"

"ఓ గంట అయింది—" అన్నాడు మాధవరావు.

ఆమె తన్ను ఏకవచనంలో పిలిచిందన్న స్పృహ కూడా పోయింది మాధవరావుకు.

"అదికాదు నేనడుగుతున్నది. ఈ పట్నానికి?"

"అదా! వచ్చి వారం రోజులయింది" అన్నాడు మాధవ్.

"ఈ వారం రోజులనుండీ ఎక్కడున్నావు?"

"ఏనుగుల గడ్డలో"

"అదేం పేరు? ఏదో అబద్ధం ఆడుతున్నావే!"అన్నది. ఆమె చెంపలమీద చిరుకోపం నర్తించింది.

"ఔను. చౌరస్తా దగ్గర వున్నదాన్ని ఏనుగులగడ్డ అనేకదూ అంటారు" అన్నాడు మాధవరావు అనుమానంగా. ఎందుకంటే, ఈమె స్థానిక స్త్రీ. తనకు వూరు కొత్త. దానికి వేరే పేరేమయినా వుందేమో మరి!!

"ఈ వేషమేమిటి? ఈ జుట్టేమిటి? ఏమిటిలా మారిపోయావ్? ఎవరు నిన్నిలా మార్చారు?" అన్నదామె.

మాధవరావుకు మతిపోతున్నట్లనిపించింది.

"లేదు- నేనెప్పుడూ ఇవే దుస్తులు ధరిస్తాను."

ఆమె కళ్ళు ఎందుకో దాసాని పువ్వుల్లా కనిపించాయి మాధవ్‌కు.

"ఇందాకటినుంచి చూస్తున్నాను నీ ధోరణి. నన్ను 'మీర' ని అంటున్నావు. మీ ఇల్లెక్కడంటున్నావు. నీ దేవి ముందు కూడా నీవబద్ధమాడుతున్నావు. ఇంక నేనేం చేయను?? మంచిది .వెళ్ళిరా"

మాధవరావు వెళ్ళలేకపోయాడు.

"ఫో—మందర వెళ్ళిపో" అన్నదామె.

"ఏమిటీ?" అన్నాడు మాధవరావు అయోమయంగా.

"వెళ్ళు. ఆ మందరకే వెళ్ళు మళ్ళీ —ఈ నగరంలో నీకేం పని?"

"మందరకా! ఏ మందర?" అన్నాడు మాధవరావు.

"ఓహోహో: వింత నంగనాచివి. ఏం దొంగనాటకం!" ఆమె ఆవేశంతో చలించిపోయింది.

మాధవరావు నిర్విణ్ణుడై చూస్తున్నాడు గుడ్లప్పగించి.

ఆమె మాధవరావును చూస్తున్నది.

మాధవరావు ఆమెను చూస్తున్నాడు.

కొంచెంసేపయిన తర్వాత ఆమె శిధిల మంటపం నుండి లేచి స్త్రీ శిల్పం దగ్గరికి వచ్చింది.

మాధవరావు తనకు తెలియకుండానే లేచి నిలబడ్డాడు.

"ఇలారా" ఆమె పిలిచింది.

మాధవరావు ఆమెదగ్గరకి పోయాడు.

ఆమె నవ్వింది మళ్ళీ—

అయితే ఆ నవ్వులో మార్దవంలేదు.

ఏదో కోపం వుంది.

"చూడు కోటకు ఎప్పుడు వెళ్తున్నావు?"

మాధవరావు విస్వెరపోయాడు. తాను కోటకు వెళుతున్నట్టు ఈమెకెలా తెలుసు??

"రేపు ఆదివారం వెళ్దామనుకుంటున్నాను."

"వెళ్ళు. నీకక్కడ బాగా సన్మానం జరుగుతుందిలే!"

"అంటే...."

"సోమూ—ఎందుకు అన్ని మాటలూ నాచేతనే చెప్పించాలని ప్రయత్నిస్తావు....నీవు మోసగాడివి. నిన్నిక నేను నమ్మను."

ఆమె ఎందుకో ఒక్కసారి ఆవేశంతో ఏడ్చింది. అలా ఏడుస్తూనే శిల్పాల చాటుకు వెళ్ళిపోయి నట్లనిపించింది మాధవరావుకు.

మాధవరావు శిల్పాల వెనుకకు వెళ్ళి చూచాడు. ఆమె కన్పడలేదు.

"ఏమండీ—ఏమండీ!" మాధవరావు కేకేశాడు. ఎవరూ బదులు పలకలేదు.

మాధవరావు గబ గబా మంటపమంతా వెతికాడు. ఎవరూ కన్పించలేదు.

'ఈమె ఇల్లు పక్కనే మోహరివాడలోనట. గోడదూకి పోయిందేమిటి?' అని గోడదగ్గరికి పోయి చూచాడు.

కన్పించలేదు.

"ఏమండీ!" మళ్ళీ పిలిచాడు మాధవరావు.

"కౌన్ హైవో?" (ఎవరక్కడ?) ఆలయం చౌకీదార్ కేక.

చౌకీదార్ లాంతరు చేతబట్టుకొని వచ్చాడు.

"ఆప్, కహాసే ఆయే?" (మీరెక్కడినుంచి వచ్చారు?) అని అడిగాడు చౌకీదార్.

"నాపేరు మాధవరావు. ఈ వూరికి కొత్త. సాయంత్రం ఆలయం చూద్దామని వచ్చాను" అని జవాబు చెప్పాడు మాధవరావు.

"ఎక్కడుంటారు?"

"ఏనుగుల గడ్డలో"

"అట్లనా! మంచిది, వెళ్ళిరండి. చీకటి పడింది. పురుగూ పుట్రా వుంటై రాళ్ళల్లో" అన్నాడు చౌకీదార్.

"ఇప్పుడెవరైనా ఇటు వెళ్ళారా?" మాధవరావు ప్రశ్నించాడు.

"ఎవరూ వెళ్ళలేదే - అంతా సాయంత్రం ఆడుకొట్టే సరికే వెళ్ళిపోయారు. చీకటి పడితే ఎవరూ రారు సార్!" అన్నాడు చౌకీదార్.

మోహరివాడలో వుండే స్త్రీ గూర్చి అడగాలని అనుకున్నాడు. కాని చౌకీదార్ ఏమనుకుంటాడోనని మాధవరావు మళ్ళీ అడగలేదు.

"ఎట్లావుంది సార్ గుడి?" చౌకీదార్ ప్రశ్నించాడు ఉర్దూలో.

"అద్భుతంగా వుంది." అన్నాడు మాధవరావు.

"తమరేం చేస్తుంటారు సార్?"

"చారస్తాలో బ్యాంక్‌లో ఉద్యోగం"

"బ్యాంక్‌లోనా.... సార్ - నాకు లోన్ కావాలి సార్! ఇప్పిస్తారా సార్?"

"చూద్దాం - రేప్రరా బ్యాంక్‌కి"

చౌకీదార్ మాధవరావుకు భృత్యుడై పోయాడు.

"తమ పేరు సార్?"

"మాధవరావు."

"రాబ్రూసాబ్! మావాడు గేదెల్ని పెంచుకుంటా నంటున్నాడు సార్. లోన్ ఇప్పించండి సార్. మీ కాళ్ళకు మొక్కుతాను."

"రేపురా"

"తప్పకుండా వస్తాను సార్"

మాధవరావు ఆలయంనుండి బయటకు వచ్చాడు.

"మళ్ళీ తమరు గుడిచూడ్డానికి వస్తారా సార్?"

"వస్తాను—రేపు సాయంత్రం మళ్ళీ వస్తాను."

# 2

మర్నాడు సాయంత్రం మళ్ళీ శిథిల మంటపం దగ్గరికి వచ్చాడు మాధవరావు.

కొంచెం పొద్దుపోయిన తర్వాత చంద్రోదయమైంది. నిన్నటి ప్రదేశంలోనే కూర్చొని ఆమెకోసం వెతికాడు. అయినా కన్పించలేదు.

చంద్రకిరణాలు శిథిల మంటపంలో పడుతున్నాయి వెన్నెల జల్లులాగా—మాధవరావు అందులో తడుస్తున్నాడు. తర్వాత అటూ ఇటూ తిరిగాడు.

గోడమీది నుండి కిందికి తొంగిచూచాడు. ఎవరూ కనిపించలేదు.

బాగా పొద్దుపోయే వరకూ అలాగే ఎదురుచూచాడు. కాని ఏమీ ప్రయోజనం కన్పించలేదు. దానితో మాధవరావుకు అనుమానం వచ్చింది-

'నిన్న జరిగిన సంఘటన నిజమేనా- కాదా??' అని-

ఒక వేళ తాను అలసటవచ్చి నిద్రపోతే, కునుకులో కల రాలేదు కదా!!

"అబ్బే! అది కలేమిటి నాముఖం—స్పష్టంగా చూస్తే—మాట్లాడితే—"అనుకున్నాడు మాధవరావు.

"ఏమిటి సార్ వెతుకుతున్నారు?" అంటూ చౌకీదార్ అబ్దుల్లా వచ్చాడు మంటపంలోకి.

అబ్దుల్లా ఆ ఉదయం బ్యాంక్‌కు వచ్చాడు. అబ్దుల్లాను కావల సిన సహాయం రికమెండ్ చేశాడు మాధవ్.

"అబ్దుల్లా! ఇలారా" అన్నాడు మాధవ్.

లాంతరు పట్టుకొని మంటపం వద్దకు వచ్చాడు అబ్దుల్లా. లాంతరు కింద పెట్టి భృత్యునిలా రెండుచేతులూ కట్టుకొని నిలబడ్డాడు.

"అబ్దులా!"

"సార్"

"నీవెక్కడ వుంటావు?"

"ఇక్కడే సార్"

శాసనం వున్న దిక్కుకు చూపించాడు.

శిలా శాసనానికి అవతల మెట్లువున్నాయి. మెట్లకవతల వరుసగా ఇళ్ళు వున్నాయి.

"అబ్దుల్లా! ఇక్కడ నువ్వు ఎన్నాళ్ళనుండి కాపలా వుంటున్నావు?"

"చాలా దినాలనుండి సార్"

"నీవెప్పుడైనా ఈ మంటపంలో స్త్రీలను చూశావా?"

"చూడకేం సార్! రోజూ ఎందరెందరో అమ్మాయిలు ఎన్నెన్నో దేశాలనుండి వచ్చి ఇక్కడ కూర్చుంటుంటారు."

"టూరిస్టులు కాదు - ఈ గుడి చుట్టుపక్కల వాళ్ళు"

"పక్కవాళ్ళ నెవరినీ నేను రానివ్వను సార్ - అబ్దుల్లా పేరు చెబితే వాళ్ళకు భయం - పగలే ఎవరూ లోపలికిరారు. ఎవరినీ మనం నమ్మకూడదు సార్! మెల్లగా దూరి ఇక్కడి రాళ్ళు ఎత్తుకుపోయి గోడలు కట్టుకుంటారు."

అబ్దుల్లాను 'ఆమె' గూర్చి ఎలా అడగాలో మాధవ్‌కు అర్థం కాలేదు. కాసేపాగి—

"అబ్దుల్లా! నీకు దయ్యాల మీద నమ్మకం వుందా?" అని అడిగాడు.

"ఆఁ! వుంది సార్ - నేను దయ్యాలను చూశాను సార్!" అన్నాడు అబ్దుల్లా.

"ఎక్కడ? ఈ మంటపంలో నేనా?" అన్నాడు ఆదుర్దాగా—

"కాదు సార్—ములుగు రోడ్డుదగ్గర చూశాను సార్"

మాధవరావు నిరుత్సాహ పడ్డాడు.

అయితే, అబ్దుల్లాకు మాత్రం మంచి టాపిక్ దొరికింది. ములుగు రోడ్డువద్ద తాను చూచిన దయ్యం అనుభవాన్ని వివరంగా చెపుతున్నాడు.

"ఆనాడు అర్ధరాత్రి దాటింది. నేను వరంగల్ నుంచి వస్తున్నాను సార్ రెండో ఆట సినిమా చూసి. మార్కండేయటాకీస్ లేదు సార్ అక్కడినుండి—అదే—సరోజ్ అవి ఇప్పుడు పేరు పెట్టారులేండి. నేను చెప్పేది చాలా ఏళ్ళనాటి ముచ్చట సార్. అప్పటికి నాకీనౌకరీ దొరకలేదు ఇంకా—

"నడ్చుకుంటూ నడ్చుకుంటూ మడివాడ మీదుగా వస్తున్నాను సార్—

ఇంతలో నాకుముందే ఎవరో నడిచి పోతున్నట్లని పించింది.

బురఖా వుంది—

గబ గబా నడిచి పోతున్నది.

ఔరత్!

ఇంతరాత్రి వేళ....

నేనూ ఆమె వెన్కనే గబ గబా నడిచాను సార్!

ఆమె ముందూ—

నేను వెనుక—

అట్లా పోయి పోయి ఆమె ములుగురోడ్డుదగ్గర ఆగింది సార్.

నేనూ ఆగినాను సార్—

ఆమె నిలబడింది.

నేనూ నిలబడినాను సార్—

"ఏయ్— ఎవరు నువ్వు—ఎక్కడికి పోతున్నావ్?" అని అడిగాను సార్—

ఆమె జవాబు చెప్పలేదు.

నేను కొంచెం దగ్గర్కి పోయినాన్ సార్.

"మాట్లాడు—రాత్రివేళ చోర్వవా, ఎటుపోతున్నావ్?" అని అడ్గినాన్ సార్,

ఆమె గాజులు గల గల లాడించింది,

దానితో నాకూ కైపెక్కింది సార్—

మెల్లగా దగ్గర్కి పోయినాను.

బురఖా పట్టుకున్నాను,

పైకెత్తినాను సార్—

సార్—చూస్తే—బురఖా కింద మనిషి లేదు సార్...."

"మరేమి వుంది?" మాధవ్ అడిగాడు.

"దయ్యం సార్—దయ్యం! సైతాన్ వుంది—"

అబ్దుల్లా వణుకు తున్నాడు.

మాధవ్‌కూ వణుకు వచ్చింది.

దయ్యం పేరు చెప్పినందుకుగాను అబ్దుల్లా ఉర్దూలో ఏవో మంత్రాలలాంటివి చదివాడు.

దానితో, "ఆమె" గూర్చి ఇక అబ్దుల్లాను అడిగే ధైర్యం మాధవ్‌కు నశించింది.

అబ్దుల్లా కాస్త ధైర్యం తెచ్చుకొని ఆ ముసుగు లోన్ దయ్యాన్ని వర్ణించడానికి మళ్ళీ సిద్ధ పడ్డాడు.

అయితే మాధవ్ వినేందుకు కుతూహలం కనపరచ లేదు. అది గమనించి అబ్దుల్లా తన కథనం ఆపాడు.

"ఇంకోసారి చెపుతాన్ సార్, సైతాన్ మున్నట్లు - పగలు పూట" అన్నాడు అబ్దుల్లా.

గడియారం చూసుకున్నాడు మాధవ్.

రాత్రి తొమ్మిదయింది.

మాధవ్ శిధిల మంటపం నుండి ఇంటి ముఖం పట్టాడు.

లక్ష్మి, మాధవ్ కోసం ఎదురు చూస్తూ వుంది.

"ఏమండీ ఇంత పొద్దుపోయింది?" అన్నది లక్ష్మి.

"ఆ! ఏం లేదు-బ్యాంక్‌లోని ఓ స్నేహితుని ఇంటికి వెళ్ళాను" అన్నాడు మాధవ్.

లక్ష్మి ప్రేమతో అన్నం, చపాతీలూ, ఆలుగడ్డ కూర వడ్డించింది.

మాధవ్ మందు తిన్నట్లు తిని మేను వాల్చాడు.

భర్తలోని నిరుత్సాహానికి కారణం తెలియక, లక్ష్మి తిక మక పడింది.

మాధవ్‌కు ఆశ ఇంకా చావలేదు.

మళ్ళీ మూడో నాడు కూడా ఆమె కోసం శిధిల మంటపంలో సాయంత్రం వెతికాడు.

ప్రయోజనం శూన్యం!

దానితో తనకు ఏదో భ్రమలాంటిది కలిగివుంటుందన్న భావం రానే వచ్చింది.

రాం హైదరాబాదు నుండి వచ్చాడు.

ఆదివారం పిక్నిక్‌కు అన్ని ఏర్పాట్లూ చేసుకున్నారు లక్ష్మి, కాత్యాయనులు.

ఆదివారం పొద్దున్నే కారియర్లు పట్టుకొని బయలు దేరారు.

కాత్యాయినీ, రామచంద్రా కిషన్‌పురా నుండి వచ్చారు.

చౌరస్తాలో టాంగా మాట్లాడుకున్నారు.

మూడు రూపాయలకు బేరం కుదిరింది.

రామచంద్రరావును చూసే సరికి మాధవ్‌లో మళ్ళీ కొత్త ఆశ చిగురించింది.

తన సమస్యకు ఆతడేమైనా పరిష్కారం ఇవ్వగలడని తోచింది.

ఖిల్లా దగ్గర చెప్పాలనుకున్నాడు.

టాంగా ములుగు రోడ్, గాంధీ హాస్పటల్, మశ్వాడల మీదుగా వరంగల్ చౌరస్తాకు పోయింది.

చౌరస్తా నుండి దక్షిణం వైపుకు సాగింది టాంగా - ఆడ వాళ్ళు హుషారుగా కబుర్లు చెప్పుకుంటున్నారు. మాధవ్ ఈ కొత్త ప్రదేశాన్ని ఆసక్తిగా పరిశీలిస్తున్నాడు.

రాం తన చారిత్రక పాండిత్యమంతా మాధవ్ ముందు ప్రదర్శిస్తున్నాడు.

"అరే మాధవ్! ఇదుగో మన మిప్పుడు వరంగల్ దాటాం. వరంగల్ అనేది పూర్వం ఒక వూరు కాదు, మట్టివాడ. రామన్న పేట, గిర్మాజిపేట, ఇలానగర్, గోవిందనగర్ అనే అయిదు గ్రామాల కూడలి. దీనికి దక్షిణ ప్రాంతాన్ని కరీమాబాద్ అంటారు. స్థానికులు దీన్ని కరీంబాద అని పిలుస్తారు. ఇక్కడి చెరువులో గణేశ నిమజ్జనం, బతకమ్మల ఉత్సవం చాలా వైభవంగా చేస్తారు."

టాంగా వేగంగా పోతున్నది.

మట్టికోట వచ్చింది.

"మాధవ్-ఇదే మట్టి కోట. దీని లోపల రాతి కోట వుంది. పూర్వమయితే కాకతీయుల నాడు మొత్తం ఏడు కోటలుండేవి. కంచు కోట, ఇటుక కోట, రాతి కోట, పుట్ట కోట, భూమి కోట, కంప కోట, గవిని కోట అని వాటి పేర్లురా.... ఇదుగో ఈ మట్టి కోట ఫిరంగులు తగిలినా పగలదు. అంత గట్టిగా కట్టారు. మట్టిని ఏనుగుల చేత తొక్కించి అందులో కోడిగుడ్ల సొన కలిపి కట్టారని అంటారు."

టాంగా మట్టి కోట దాటింది.

రాం చారిత్రక విశేషాలు వర్ణిస్తున్నాడు.

మాధవ్ శ్రద్ధగా వింటున్నాడు.

"అరే మాధవ్! నేను చెపుతున్నది చరిత్ర కాదు. ఎనిమిది శతాబ్దాల నాటి మన వైభవ కథ! ఎనిమిది వందల సంవత్సరాలకు ముందు ఎగిరిన మన కీర్తి బావుటా ధగధగలు - కాల చక్రంలో

మట్టిలో కలిసిన మన విజయ పరాజయాలకు చిహ్నంగా ఇంకా మిగిలిన జ్ఞాపకాలురా ఈ బురుజులు."

మాధవ్‌కు కళ్లవెంట నీళ్ళు తిరిగాయి—

రాతి కోట వచ్చింది:

"అరే - దీని వలయం ఎనిమిది మైళ్ళు రా: దీనికి నాలుగు వైపులా నాలుగు సింహ ద్వారాలున్నాయి. పింహాలున్నాయి. సున్నం వాడని కట్టడమిది. మాలిక్ కాఫర్ దండయాత్ర తర్వాత ఈ కోట మొత్తం ధ్వంసమయింది. ఇందులోని అందమైన శిల్పాలనన్నీ కూల గొట్టి భూస్థాపితం చేశారు. తోరణ స్తంభాలు విరిచారు. ఇక్కడి రత్నాభరణాలను కొల్లగొట్టి రాజకుమార్తెలను, అంతఃపుర స్త్రీలను రచ్చ కీడ్చి మానభంగాలు చేశారు."

మాధవరావు హృదయం ఆర్ద్రమైంది.

తానేదో విహార యాత్రకు కాక శోక యాత్రకు బయలుదేరినట్లనిపించింది.

ఈ పరాజయాన్ని ఏమని చూడటం?

చూచి ఎలా సహించడం?

టాంగా స్వయంభూ దేవాలయం దగ్గర ఆగింది.

కాత్యాయనీ, లక్ష్మి, ఇందిరా ముందు దిగారు.

రాం టాంగా వాడికి డబ్బులిచ్చాడు.

ముందుగా అంతా స్వయంభూ ఆలయంలోకి వెళ్ళారు. "ఇదిరా కాకతీయుల ఇష్ట దైవపు గుడి. ఈ గుడిని ఇక్కడి వాళ్ళు, 'శంబుని ఆలయం' అంటారిప్పుడు పలకటం చేత కాక.

ఇది పూర్వం పరుసవేది లింగం.

ఇనుము తాకిస్తే, బంగారమయ్యేది."

"మనం తాకిద్దామా?" అన్నది కాత్యయని.

"వెర్రి మొహమా! ఆ పరుసవేది లింగం దండ యాత్రల్లో ఎప్పుడో పగిలిపోయి వుంటుంది. ఇప్పుడున్నది వేరే లింగం కావచ్చు. ఇదే పరుసవేది అయితే ఇంక మనకు కోలారు గను లెందుకు?

కాకతీయ రాజ వంశంలోని పదోవాడైన ప్రోలరాజు పాలిస్తు న్నప్పుడు ఇక్కడి నుండి ధాన్యపు బండ్లు హనుమ కొండకు పోతు న్నాయట। అప్పుడు రాజధాని హనుమకొండలో వుండేదట. ధాన్యం తెచ్చే బండ్లు రాత్రి పూట తల్లక్రిందులైనాయట. మర్నాడు ఉదయం బండ్లను లేవనెత్తుదామని చూస్తే, బండి చక్రాల ఇనుము బంగారమై వుంది.

ఈ విషయం రాజుగారికి తెలిసింది. ఆయన వచ్చి అక్కడ త్రవ్వకం సాగించాడు. భూమిలోంచి ఒక జ్యోతిర్లింగం బయటకు వచ్చింది. దానిని హనుమకొండకు తీసుకు పోవాలని ప్రయత్నించారు కాని, లాభం లేకపోయింది. అందుకని ప్రోలరాజు ఆ లింగం మీదనే గుడి కట్టించాడు.

అదే స్వయం భూమందిరం.

ఆ తర్వాత రాజధాని కూడా ఇక్కడకే మార్చబడింది—"

మాధవరావ్ రామచంద్ర చెప్పే కథ విని ఆలయం లోపల నుండి బయటకు వచ్చాడు.

అప్పటికే లక్ష్మి, కాత్యాయనీ, కోటలోని శిల్పాల దగ్గరికి వెళ్లారు.

మాధవరావుకు మొన్నటి సంఘటన చెప్పాలనిపించింది.

"రాం।"

"ఏమిట్రా?"

"నే నొకటి చెపుతాను నమ్ముతావా?"

"అదేమిట్రా। నీ వేమి చెప్పినా నమ్ముతాను। స్వర్గలోకం నుంచి అప్సరస దిగి నిన్న రాత్రి నిన్ను ప్రేమించిందంటే కూడా నమ్మేస్తాను."

మాధవ్ ఆవేశంతో రాం రెండు భుజాలు పట్టుకొని ఊపి, "రాం। అదే జరిగిందిరా।" అన్నాడు.

ఆ తర్వాత ఇంకేమనాలో తెలియక ఊరుకున్నాడు.

రామచంద్ర మాధవ్ వైపు ప్రశ్నార్థకంగా చూచాడు.

"అవునురా! మొన్న నొక అందాల సుందరి రాత్రి వేళ నాకు కన్పించింది. నన్ను ప్రేమించినట్లు మాట్లాడింది రా!"

రాంకు అనుమానం కల్గింది.

'మాధవ్‌కు ఉదయపు ఎండకేమైనా పైత్యం చేసిందా?' అనుకున్నాడు ఒక్క క్షణం.

అయితే మాధవ్‌లోని ఆవేశం ఇంక ఆగేటట్లు లేదు—

రామ్‌తో జరిగిందంతా చెప్పి, అటో ఇటో తేల్చుకోవాలి—

"ఎవ్వరా నిన్ను ప్రేమించింది?"

"ఎవరో తెలియదు!"

"ఆమె పేరేమిటి?"

"తెలియదు!"

"ఎక్కడ ప్రేమించింది?"

"వేయి స్థంభాల గుడిలో!"

"ఎప్పుడు?"

"మొన్న పూర్ణిమ రోజు రాత్రి!"

రాం అయోమయంగా మాధవ్ వైపు చూశాడు.

మాధవరావు నిప్పు లాంటి మనిషి.

లక్ష్మిని తప్ప పర స్త్రీని కన్నెత్తి చూడడు.

అలాంటిది, ఈ ప్రేమ ఏమిటీ- ఈ మాటలేమిటీ?

రాంకు అగమ్య గోచరంగా వుంది.

"ఆమె నిన్ను ప్రేమించానని చెప్పిందా?"

"అలా చెప్ప లేదు-ఆమె మాటలను బట్టి నేను గ్రహించాను."

"నీవు ఆమెను ప్రేమించావా?"

"ఏమో! సరిగ్గా చెప్పలేను"

"ఇదేమిట్రా! వ్యవహారమంతా తిరకాసుగా వుంది. ఆమె ప్రేమించిందో,లేవో తెలియదంటుంటివి. అసలేం జరిగింది మాధవ్?"

రామచంద్ర నీడ చూచుకొని ఓ రాతి మీద కూర్చున్నాడు.

మాధవ్ పక్కనే కూర్చొని మెల్లగా మొన్న రాత్రి జరిగిన సంఘటన వివరంగా చెప్పాడు.

రామచంద్ర అంతా విన్నాడు.

"ఏమిటక్కడ తిష్టవేసుకొని కూర్చున్నారు, ఈ శిల్పాలు చూడకుండా?" దూరంనుంచి కాత్యాయని కేక.

రాం, మాధవులులేచారు.

నడుచుకుంటూ శిల్పాలదగ్గరికి వెళ్ళారు.

ఎత్తైన కీర్తి స్థంభం అతిధులకు స్వాగతం పలికింది.

విరిగిపోయిన శిల్పాలనన్నీ అక్కడి రక్షణాధికారులు ఒక చోటికి చేరవేసి వుంచారు.

రామచంద్ర, మాధవులు ఆ శిల్పాలమధ్యనుండి నడుస్తూ వెళ్ళారు.

"అరెరే! అంతా చాళుక్య శిల్పంరా" అన్నాడు రాం.

మాధవరావుకు చాళుక్య శిల్పానికీ,మరో శిల్పానికీ మధ్యనున్న భేదం తెలియదుకాని, ఆ శిల్పాలను చూస్తుంటే, ఏదో విచిత్రానుభూతి కలిగింది.

ఒక్కొక్కరాతినీ తాకుతుంటే, ఏదో విద్యుత్తు వాటినుండి తన శరీరంలోకి ప్రవేశిస్తున్నట్లు అనిపించింది.

అక్కడ ఒక గైడ్ ఒక టూరిష్టుపార్టీకి శిల్పవిశేషాలు వివరిస్తున్నాడు. "ఓరుగల్లు మహావైభవోపేతంగా ఉండేదిసార్ పూర్వం. అప్పుడీ శిథిలాల దగ్గరే భైరవాలయం,చాముండేశ్వరీ మందిరం,మహాశక్తి నగరం, వీరభద్రునిగుడి, కుమారస్వామిగుడి, పాండవులగుడి వుండేవండి.

మైలారదేవుని ఉత్సవాలు ఈ నగరంలో మహావైభవంగా జరిగేవి. ఇటు రండిసార్ ఇటు. ఈ నగరాన్ని మార్కోపోలోచూచి ఆశ్చర్యపోయాడు సార్. అల్లూఫ్‌ఖాను అనే ఒక ముస్లిం సేనాని భద్రకాళి గుడిదగ్గర గుట్టమీద నిలబడిచూస్తే, ఇప్పుడు మనమున్న

చోట ఎటుచూచినా రెండుమైళ్ళు పొదవున్న ఫౌంటెన్స్ కనపడ్తా యిట సార్-"

మాధవరావులో ఏదో ఆవేశం వచ్చింది.

"రాం! ఆ తోట నా కళ్ళకు కన్పడుతున్నట్లుగా అనిపిస్తున్నది. నేనాతోటలో తిరుగుతున్నట్లూ, అందులో సంపెంగలూ, సన్న జాజులూ, మల్లెలూ మొగలిపొదలూ వున్నట్లు అనిపిస్తున్నది."

రాం నవ్వాడు. "నాకూ అట్లాగే అనిపిస్తున్నది. ఊహించు కుంటే ఎవరికైనా అనిపిస్తుంది, ఆ ప్రాచీనవైభవం కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది."

మాధవరావు సంతృప్తికోసం ఏదో పైకి అలా అన్నాడేకాని రామచంద్రరావుకు మనస్సులో ఇంతకుముందు లేని కొత్త అను మానాలు బయలుదేరాయి.

ఇంటికిపోతేనేకాని ఆ అనుమానాలు తీరవు.

ఈ లోపల అంతా కోట చూచారు.

షితాబుఖాను దర్బారు హాలుదగ్గర కూర్చొని తెచ్చిన పదార్థా లను వడ్డించుకున్నారు.

గారెలూ, పాయసం, వెజిటబుల్ పలావ్, ఉల్లిచట్నీలు తెచ్చుకున్నారు.

ఏదీ ఒక్క రవ్వకూడా మిగలకుండా తినేశారు ఐదుగురూ.

రామచంద్రకు గొప్ప చారిత్రక విజ్ఞానంవుంది.

అందువల్ల ఆ కోట కబుర్లన్నీ చెప్పాడు.

"పూర్వం ఇక్కడ పెద్ద గడియారం వుండేదిరా! దాన్నిచూచి గంటలు కొట్టేవారు. అయిదారువందల పూటకూళ్ళ ఇళ్ళుకూడా వుండేవి. రూపాయిపెడితే, షడ్రసోపేతమైన భోజనం పెట్టేవారు నాలుగైదు స్వీట్స్‌తోసహా-"

"అబ్బ! మనమంతా ఆ కాలంలోవుంటే ఎంత బాగుండేది. హాయిగా అనుభవించి వుండేవాళ్ళం. ఇప్పుడేముంది? రెండు

రూపాయలుపెట్టినా నూరుగ్రాముల మిఠాయిరావడంలేదు" అన్నది కాత్యాయని.

భోజనానంతరం కాసేపు విశ్రమించారు.

సాయంత్రం మూడుగంటలకే కోటచూడటం ముగిసింది.

ఇంకా మూడుగంటల పొద్దువుంది.

"వెళ్తూ భద్రకాళి గుడి చూపి వెళ్దాం. సరిపోతుంది" అన్నాడు రామచంద్రరావు.

అంతా సంతోషంగా ఒప్పుకున్నారు.

కోటనుండి భద్రకాళిగుడికి ఓ టాంగా మాట్లాడుకొని ఎక్కారు.

ఓ ముప్పావుగంటలో భద్రకాళిగుడి వచ్చింది.

"రాం!" అన్నాడు మాధవ్.

"ఏమిటి?"

"నాకెందుకో ఆ కోటను వదిలిపెట్ట బుద్ధి పుట్టలేదురా. చూస్తుంటే, ఇంకా చూడాలనిపించింది. ఎందుకో అక్కడే ఉండి పోవాలనిపించింది."

"అదే మన ప్రాచీన వైభవ విశేషం. చూస్తుంటే కన్నులు చెమ్మగిల్లుతాయి, హృదయం ద్రవిస్తుంది, మనస్సు వికలమవుతుంది మాధవ్! ఈ దుస్థితిచూచి."

భద్రకాళిగుడి ఎత్తైనగుట్టమీద వుంది.

వరంగల్, కాజీపేటలకు సరిగ్గా మధ్యలోవుంది.

గుడిపక్కనే ఓ చెరువు.

"ఇప్పుడు మనం సముద్రతీరానికి సుమారు పదకొండువందల అడుగుల ఎత్తులోవున్నాం మాధవ్!" అన్నాడు రామచంద్ర గుట్టనెక్కి.

అమ్మవారి గుడికిముందు నాగప్రతిష్ఠ జరిగివుంది.

ఆ పక్కనే ఓ యజ్ఞగుండం వుంది.

గుడికి పక్కనే శివాలయంవుంది చిన్నది.

అంతా గుళ్ళోకి వెళ్ళారు.
ముందు వెడల్పాటి మంటపం.
అక్కడ సింహాశిల్పం.
లోపల గర్భగుడిలో చాలా ఎత్తైన అమ్మవారి విగ్రహం వుంది.

పూజారి కుంకుమతో భద్రకాళికి పూజులు చేస్తున్నాడు, సహస్రనామాలు చదువుతూ.

రాం, మాధవుల కుటుంబాలేకాక, మరికొందరుకూడా భక్తితో చేతులు కట్టుకొని కూర్చున్నారు.

పూజారి శ్రీసూక్తం చదువుతున్నాడు.

"హిరణ్య వర్ణాం హరిణీం సువర్ణరజతస్రజాం
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాత వేదోమమావహ"
కొబ్బరికాయలు వరుసగా కొడుతున్నాడు.
ఇంకో చిన్నపూజారి సాంబ్రాణీకడ్డీలు వెలిగించాడు ఓ కట్ట.
వాతావరణమంతా పరవశంగా వుంది.
పూజారి హారతి వెలిగించాడు.
భక్తులు గణ గణ గంటలు కొడుతున్నారు.
"అమ్మా- అమ్మా! కాళీమాతా!"
దివ్యగంధంతో వాతావరణం పరిమళిస్తున్నది.
భక్తులంతా లేచి నిలబడ్డారు.
"యః శుచిః ప్రియతో భూత్వాజుహూ యాదాజ్య
మన్వహమ్! శ్రియంః పంచదశర్చంచశ్రీకా మస్పతతం
జపేత్...."

మాధవరావు పరవశుడైనాడు- మనిషితూలాడు. అంతా అటు చూస్తుండగా, నిలుచున్నవాడు నిలుచున్నట్లే పడిపోయాడు.

రాం, లక్ష్మి, కాత్యాయనీ గాభరాపడ్డారు.
పూజారి వాళ్ళని భయపడవద్దని వారించాడు.

"అమ్మవారి దయ ఆయనమీద కలిగింది. ఆయనకు తల్లి దివ్యదర్శనం కలుగుతున్నది. కదిలించకండి"

# 3

మాధవరావు ఇంటికి వచ్చాక కోలుకున్నాడు.

మామూలుగా ఉద్యోగానికి పోతున్నాడు.

అయితే ఇతడు పూర్వపు మాధవరావుకాదు.

వెనుకటి ఉత్సాహంలేదు, హుషారులేదు.

ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నాడు.

దేన్నో శూన్యంలో వెతుకుతున్నాడు.

వీలు చిక్కినప్పుడల్లా వేయిస్థంభాల గుడిలో శిధిలమంటపం దగ్గర కూర్చుంటున్నాడు.

రామచంద్రరావు ఒకనాడు గుడి దగ్గరకు వెళ్ళి ఒంటరిగా ఆలయాన్నంతా పరిశీలించాడు.

శిధిల మంటపం వద్దనుండి దక్షిణపు దిక్కున వున్న బజార్లకు మధ్యగల గోడపడిపోయిన మాట నిజమే కాని, ఒక స్త్రీ గోడ దూకి పోగలిగేటంత సౌకర్యంగా మాత్రంలేదు.

చిన్న పిల్లలయితే గెంతవచ్చు పైనుండి.

అక్కడవున్న స్త్రీలను పరిశీలించాడు.

అంతా మామూలు కుటుంబీకులు. మాధవరావు వర్ణించిన అపూర్వ సౌందర్యం కన్పడలేదు.

"దీనిని మోహరివాడి అనేనా అంటారు?" అని అడిగాడు రాం.

"మోహరివాడా? ఆపేరేమిటో మాకు తెలియదు" అన్నారు అక్కడివాళ్ళు.

"పోనీ ఈ పేరుగల గల్లీ ఈ పక్కన ఎక్కడైనా వుందా?"

"లేదండీ!" అన్నారు.

రామచంద్రరావు మళ్ళీ ఇంటికి వచ్చాడు.

మాధవరావును ఏదైనా భ్రమకలిగిందా?
లేక మాధవ్ చూసింది ఏదైనా పిశాచమా?
ఈ రెండు అంశాలలోనూ ఏదీ నిర్ధారించుకోలేక పోయాడు.
మాధవ్ ఆమెతో మాట్లాడినప్పుడు ఆమెకొన్ని పదాలు వాడింది.
'అమ్మగారి సేవకురాలిని' అన్నది.
ఎవరీ అమ్మగారు??
'మోహరివాడ' అన్నది. ఎక్కడిదిది?
'మందరకు వెళ్ళావా?' అని అడిగింది.
ఏమిటీ మందర?
'సోమూ' అన్నది మాధవ్‌ను-
ఎందుకలా అన్నది??
రాం తన స్టడీ రూంలోకి పోయి వరంగల్లుకు సంబంధించిన చరిత్రలు తీశాడు.
ఆదిరాజు వీరభద్రరావుగారి 'ప్రాచీన ఆంధ్ర నగరములు' లో వరంగల్లుమీద ఒక అధ్యాయం వుంది. ప్రతాపరెడ్డి 'సాంఘిక చరిత్ర'లో కాతతీయుల వేషభూషాదుల వర్ణనలు వున్నాయి. డాక్టర్ మారేమంద రామారావుగారి పరిశోధనవుంది. అంబడి సుబ్బారాయ చెట్టిగారి 'కాకతీయులనాటి సాంఘిక చరిత్ర' తీశాడు. ఇవికాక క్రీడాభిరామం మళ్ళీ చదివాడు.
అవసరమైన అంశాలన్నీ నోట్స్ రాసుకున్నాడు.
"ఏమిటండీ? పరీక్షకు పోయేపిల్లవాడిలా చదువుతున్నారు?" అన్నది కాత్యాయని.
కాత్యాయినికి మాధవ్ తనతో చెప్పిన విషయం చెప్పాడు రాం.
కాత్యాయని నివ్వెరపోయింది.
"అయితే ఆ స్త్రీ ఎవరంటారు?"
"అదే తెలియటంలేదు. ఒకటి మాత్రం నిజం— మాధవరావు చూచిన స్త్రీ నిజమైన స్త్రీ మాత్రం కాదు."
"అంటే?"

"ఆమె నీలాంటి, లక్ష్మిలాంటి మనిషికాదు. ఆమె దయ్యమో, దయ్యంలాంటిదో అయివుండాలి. అదీ ఇప్పటి నా అభిప్రాయం" అన్నాడు రాం.

"మొన్న గుళ్ళో వచ్చినట్లు మాధవరావుకు ఏదయినా భ్రమ వచ్చి వుండచ్చుగా?" అని కాత్యాయని ప్రశ్నించింది.

"నేనూ అలాగే అనుకున్నాను మొదట. కాని చరిత్ర పరిశోధించిన తర్వాత మాధవరావు భ్రమపడలేదనీ అతనితో **ఒక** దయ్యం మాట్లాడిందనీ నిర్ధారించుకోవలసి వచ్చింది. 'నేను అమ్మగారి సేవకురాలిని' అన్నది ఆ స్త్రీ.

ఈ మాటకు అర్థం ఏమిటో తెలియలేదు. పోతే మోహరివాడలో వుంటున్నానని చెప్పింది ఆమె. ఈ మోహరివాడ కాకతీయుల నాడు హనుమకొండలో ఒక బజారుకు పేరు. అలాగే ఇంకో మోహరివాడ మొన్న మనం ఖిల్లా చూచామే, ఆ కోటలో వుంది.

అలాగే మందర అనే పేరు కూడా కాకతీయుల నాటిదే. అదో చిన్న గ్రామం. అక్కడ కాకతీయ గణపతి దేవుడు ఒక శైవ మఠాన్ని స్థాపించాడు. దానిని గోళకీ మఠం అంటారు. ఇప్పుడు మనవాళ్ళు దానిని 'గొల్లక్క గుడి' అంటున్నారు.

ఈ ఆధారాలను బట్టి మాధవరావు భ్రమపడ లేదనీ, అతని కొక పురాతనమైన పిశాచం కనిపించిందనీ నేను వూహిస్తున్నాను,

ఆ పిశాచం అతనికెందుకు కనిపించింది?

అలాగే ఇంకా ఎవరికయినా కనిపించిందా??

దీనిని గూర్చి మరికొంత పరిశోధన చేయాలి నేను" అన్నాడు రామచంద్ర.

"నా కేమిటో భయంగా వుందండీ!" అన్నది కాత్యాయని.

"ఛ! భయమేమిటి? ఇరవయ్యో శతాబ్దపు ఉత్తరార్థంలో రాకెట్ యుగంలో జీవిస్తున్నాం మనం. మనమే భయపడితే ఎట్లా? నాకు దయ్యాల మీద విశ్వాసం లేదు. కాని ఇదేమిటో తేల్చుకునే వరకూ మనశ్శాంతి వుండదు కదా!" అన్నాడు రాం.

కాత్యాయినికి మాత్రం తీవ్రంగా భయం పట్టుకుంది.

"మనకు తెలియకుండానే మనమేదో చిక్కుల్లో పడబోతున్నామేమో!" అన్నది కాత్యాయిని.

రామచంద్రరావు మళ్ళీ ఆమెకు ధైర్యం చెప్పాడు.

"మాధవరావుకు ఒక కష్టం వచ్చింది. ఎప్పుడైనా కష్టాలలోనే స్నేహితులు కావాలి కాని, సుఖాలలో కాదు కదా! పైగా ఇదేమిటో తెలుసుకోవాలన్న కోరిక నాలోనూ తీవ్రంగా బయలుదేరింది. అందుకనన్నా దీని అంతు నేను చూడక తప్పదు" అన్నాడు రాం.

"మాధవరావు భద్రకాళి గుళ్ళో ఎందుకు పడిపోయాడు?" అన్నది కాత్యాయని.

"అదే తెలియడం లేదు. నా ఊహే నిజమయితే అతడు కేవలం భక్తి పారవశ్యంతో పడిపోలేదు. వేయి స్తంభాల గుడిలో దయ్యాన్ని చూడడానికీ, 'భద్రకాళి' గుడిలో పడిపోవడానికి మధ్య ఏదో సంబంధం వుండాలి."

"అంటే....?"

"అంటే ఏమిటో నాకెలా తెలుస్తుంది? అదేమిటో మనం కష్టపడైనా తెలుసుకోవాలి!" అన్నాడు రామచంద్ర.

"ఇదుగో చూడు! నీ నోట్లో నువ్వు గింజ నానదు. అనవసరంగా ఓ టముకు కట్టుకొని కిషన్‌పురా మొత్తం చాటింపు వెయ్యకు ఈ సంగతి. అసహ్యంగా వుంటుంది."

"బాగుంది. నేనేం పసిపిల్ల ననుకున్నారా...."

"అంతకన్నా అన్యాయం. అందుకే చెపుతున్నాను. చివరకు లక్ష్మితో కూడా ఏమీ అనకు. సమయం వచ్చినప్పుడు చెపితే చెప్పవచ్చు."

కాత్యాయని 'సరే' అన్నది.

రామచంద్ర ఈ విషయాలు ఎవరితోనూ చెప్ప కూడదని కాత్యాయనిచేత చేతిలో చేయి వేయించుకున్నాడు.

కాత్యాయని ప్రమాణం చేసింది.

అక్కడినుండి రామచంద్రరావు తన పరిశోధన మళ్ళీ ప్రారంభించాడు.

"అరే, మాధవ్! నీవు ప్రతిరోజూ సాయంత్రం ఐదు గంటలకు వెళ్ళి శిథిల మంటపంలో కూర్చో. రాత్రి పొద్దు పోయేవరకూ ఉండి తిరిగిరా. ఇలా క్రమం తప్పకుండా చెయ్యి ఏమవుతుందో చూద్దాం!" అన్నాడు రాం.

మాధవరావు అందుకు సంతోషంతో అంగీకరించాడు. రోజూ ఆఫీసు వదలగానే చౌరస్తాలో కాఫీ తాగి వెళ్ళి శిథిల మంటపంలో కూర్చోడం మొదలు పెట్టాడు. బాగా పొద్దుపోయేవాకా కూర్చొని ఎనిమిదీ, తొమ్మిదీ దాటాక తిరిగి ఇంటికి రాసాగాడు.

ఇలా కొన్నాళ్ళు గడిచింది.

రోజూ రాం, మాధవను, "ఏమన్నా కనిపించిందా?" అని అడిగేవాడు.

"ఏమీ కనిపించలేదు" అని మాధవ్ చెప్పేవాడు.

కొద్ది రోజులైనాక మాధవరావులో విసుగు, నిరాశ కనిపించాయి.

అయితే రామచంద్రరావు మాత్రం మొండిపట్టు పట్టి, "క్రమం తప్పక వెళ్ళుతూ వుండు. మనకేదైనా కొత్త ఆధారం దొరకవచ్చు" అన్నాడు.

రాం మాట కాదనలేక, ఆ సుందరిని మరచిపోలేక మాధవ్ రోజూ సాయంత్రం ఐదునుండి తొమ్మిది దాకా అలాగే ఒంటరిగా చీకట్లో శిథిల మంటపంలో గడపసాగాడు.

ప్రతిరోజూ ఇలాగే జరుగుతున్నది.

ఒకనాడు సాయంత్రం మాధవరావు మామూలుగానే మంటపంలోకి పోయాడు.

విరిగిన ఒక రాతి స్థంభం మీద కూర్చున్నాడు.

చీకటి పడింది. చంద్రోదయమైంది.

ఆలయానికి వచ్చిన టూరిస్టులంతా వెళ్ళడంతో గుడి నిర్మానుష్యంగా వుంది.

పూజారి వున్నాడో, వెళ్ళాడో తెలియదు.

మాధవ్ చీకట్లో శిథిల శిల్పాలను చూస్తూ, అలాగే కూర్చు

న్నాడు. చంద్రకిరణాలు మంటపం పైనుండి కిందికి సన్నగా జారుతున్నాయి.

ఇంతలో ఎవరో కిలకిలా నవ్వినట్లు అనిపించింది. మాధవరావు ఉలిక్కిపడి చూశాడు.

మళ్ళీ నవ్వు!

అదే నవ్వు! అదే స్వరం!

మాధవరావు మంటపమంతా ఇటూ అటూ తిరిగాడు. సన్నగా నవ్వు, ఆ తర్వాత చిన్న ఏడుపూ వినిపించింది.

'ఎవరు? ఎవరానవ్వుతున్నది?' మాధవరావు ప్రతి స్థంభం చాటుకూ వెళ్ళి వెతికాడు. ఎవరూ కనిపించలేదు.

"ఎక్కడ-ఎక్కడున్నారండీ? ఎక్కడనుంచి నవ్వుతున్నారు?"

నవ్వు మాత్రం విన్పడింది మళ్ళీ.

ఏమీ కనిపించలేదు.

మాధవరావు పిచ్చెక్కినట్లు మళ్ళీ అటూ ఇటూ తిరిగాడు. కొంచెం సేపుండి నవ్వు ఆగిపోయింది.

మళ్ళీ నిశ్శబ్దం—

మాధవరావు ఎనిమిది దాకా కూర్చున్నాడు.

తొమ్మిది దాకా కూర్చున్నాడు.

పది గంటలవరకూ కూర్చున్నాడు.

ఉహూఁ! ఏమీ ప్రయోజనం కన్పించలేదు. తర్వాత లేచి ఇంటికి వెళ్ళాడు.

మర్నాడు ఉదయం రామచంద్రరావుతో ఈ విషయం చెప్పాడు.

రామచంద్ర ఆలోచించాడు తీవ్రంగా.

అతడికి ఏమీ అంతు చిక్కలేదు.

"సరే! తొందరపడటం దేనికి? ఇవ్వాళ కూడా చూద్దాం. వెళ్ళు ఐదు గంటలకు" అన్నాడు రాం.

మాధవరావు ఆఫీసుకు వెళ్ళాడు.

ఐదుగంటలుకాగానే కాఫీ తాగి, నడుముకుంటూ వేయి స్థంభాల గుడికి బయలుదేరాడు.

లోపలికి వెళ్ళి శిథిలమంటపంలో కూర్చున్నాడు.

సూర్యాస్తమయం జరిగింది.

ఇటు సూర్యాస్తమయమూ, అటు చంద్రోదయమూ ఒకేసారి జరిగాయి.

ఆనాడు పూర్ణిమ!!

రాజహంసలాగా ఠీవిగా చంద్రబింబం నీలాకాశంలో ప్రయాణం మొదలు పెట్టింది తూర్పునుండి.

శిథిలమంటపంలో ఎక్కడా చీకటి లేదు.

చంద్రుని వెలుగుతో మంటపమంతా మొగలిపూల పుప్పొడి చల్లినట్లుగా వుంది.

ఇంతలో ఏదో ప్రత్యేకమైన కాంతి మంటపంలో మాధవరావుకు కనిపించింది.

మాధవరావు పూర్వంవలె నిర్లక్ష్యంగా లేడు.

మంటపంలో జరిగే ప్రతిమార్పూ, ప్రతిక్షణం వేయికళ్ళతో శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు.

ఓ మెరుపు మెరిపినట్లు-

ఓ చంద్రుడు మంటపంలో వెలిసినట్లు___

ఒక్కసారి ఏదో ధగ ధగ....

చూస్తుండగానే ఆ వెలుగు ఒక స్త్రీగా మారింది.

మాధవరావు పరిశీలించాడు.

ఆమేయే!!

అదే రూపం, అదే సొగసు!!

అవే రత్నాలంకారాలు, అదే చీరె హొయలు!!

ఆమె మాధవరావునుచూచి నవ్వింది.

ఎదురుగావున్న రాతిస్తంభం చివర కూర్చున్నది.

ఆమె కాళ్ళు మంటపం కిందవున్న ఒక పద్మాకారపు శిల్పాన్ని తాకుతున్నాయి.

"ఎంతసేపయింది వచ్చి?" అని ప్రశ్నించింది.

"ఇప్పుడే కొద్దిసేపయింది" అన్నాడు మాధవ్.

"కోటకు వెళ్ళావా?"

"ఆఁ, వెళ్ళాను."

"అమ్మగారు కనిపించారా?"

"ఏ అమ్మగారు?"

"ఎందరు అమ్మగార్లు వున్నారు సోమూ నీకు." అన్నది ఆమె చిరుకోపంతో.

మాధవరావు మాట్లాడలేదు.

కేవలం ఆమెను పరవశంతో చూస్తున్నాడు.

ఏమి అందమిది! ఏమి కాంతి!!

"సోమూ! నీవు మారిపోయావు." అన్నదామె.

"ఏమో- నాకు తెలియదు"

"ముఖ్యంగా మందరపోయిన దగ్గరనుండి నన్ను పూర్తిగా మరిచిపోయావు. లేకుంటే నన్ను చూడకుండా ఒక్క క్షణమైనా ఉండగలవా నీవు?"

మాధవరావు ఆమె కళ్ళల్లోకే చూస్తున్నాడు.

ఆమె మాధవ్‌ను తన కళ్ళతోనే తాగేస్తున్నది.

"మోటుపల్లి రేవులో భూతిలకము, శ్రావన్నియ, వాయు మేఘము సరిపట్టులు కొత్తగా దిగాయని చెప్పావు. మైలార దేవుని తిర నాళ్ళనాటికి త్రిసరములు నాకు సిద్ధమవుతాయన్నావు. చేతిలో చెయ్యి వేసి "అమ్మగారు ఇచ్చే పదివేల నిష్కాలలో ఐదువేలు తాటంకాలకూ, త్రిసరాలకూ ఖర్చుపెడతానన్నావు. ఎన్ని మాటలు చెప్పావు? ఎన్ని ఆశలు రేపావు? సోమూ! ఎందుకిలా అసత్యాలు చెప్పావు?? నేను నీ కేమి అన్యాయం చేసాను?"

మాధవరావు దిగ్భ్రాంతుడయి వింటున్నాడు.

"ఇలా రా!" దగ్గరకు పిలిచిందామె.

మాధవరావు ఆమె దగ్గరకు పోయాడు.

మాధవరావు రెండు భుజాలమీద రెండు చేతులు వేసింది.

మాధవరావుకు బరువు తగల లేదు.

నన్నని తన మేలి ముసుగు జార్చి, మాధవ్ రెండు చేతులనూ తన బుగ్గలకు ఆనించుకుంది.

మాధవ్‌కు ఆమె బుగ్గలు అందీ అందకుండా వున్నాయి.

మాధవ్ ఒడిలో తలదెట్టింది.

"చెప్పు సోమూ? నీవు మల్లాల గుండయ్యకు చెప్పి ఆయన ద్వారా అమ్మగారిని ఒప్పించు. నేను చామకాంబగారికి చెబుతాను. సోమూ! నీవు లేనిదే నేనిక జీవించలేను సోమూ- నన్ను వదిలిపెట్టి వెళ్ళకు."

ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

మాధవరావు మంచు ముద్ద అయినాడు.

"ఈ దీప స్థంభం మీద ప్రమాణం చెయ్యి. నన్ను వదిలి వెళ్ళనని, నీ ఉద్యోగం మానివేసి అయినా సరే, నాతోనే ఉంటానని"

మాధవరావు ఆమె చేతిలో చేయి వేశాడు.

చేయి అందీ అందకుండా వుంది!

చేతికి రత్నపుటుంగరాలు, రవ్వల గాజులూ, ధగ ధగ మెరుస్తున్నాయి.

గోరింటాకుతో అందంగా అలంకరింపబడ్డ ఆమె కుడిచేయి అరుణిమ, వెన్నెలలో స్పష్టంగా కనబడుతూ, దాసాని పువ్వులా మెరుస్తున్నది.

ఆమె తన్మయత్వంతో మాధవరావును రెండు చేతులా చుట్టి వేసింది.

మాధవ్ పరవశం చెందాడు.

లౌకిక చైతన్యాన్ని కోల్పోయాడు.

తన్మయావస్థలో ఆమె పైకి వంగాడు.

అలాగే స్పృహ తప్పి పడిపోయాడు.

అలా కొంతసేపు గడిచింది.

"సాబ్! నిద్రపోతున్నారా సాబ్?" అబ్దుల్లా లాంతరుతో వచ్చి మాధవ్‌ను లేపాడు.

మాధవ్‌కు చైతన్యం వచ్చింది.

లేచి చూచాడు.

రాత్రి పది గంటలయింది.

ఎదురుగా లాంతరు పట్టుకొని అబ్దుల్లా నిలబడి వున్నాడు.

"సాబ్! తమరు ఈ చీకటిలో కూర్చోకండిసార్! రాత్రిళ్ళు దయ్యాలుంటాయి. పాములూ, తేళ్ళూ వుంటాయి. కావాలంటే శివాలయంలో కూర్చోండి సార్! లేదా హాయిగా నంది దగ్గర కూర్చొని చంద్రుణ్ణి చూడండి. ఇక్కడ ప్రమాదం సార్!"

మాధవరావు చుట్టూ చూచాడు.

ఏమీలేదు.

ఆమె లేదు.

కనీసం ఆమె వచ్చి పోయిన జాడలైనా లేవు.

ఆమె తన నడుమును రెండు చేతులతో పట్టినప్పుడు తనకేదో దివ్యగంధం పూసినట్లుగా అనిపించింది.

ఆమె తన ఒడిలో తలపెట్టుకొని పడుకున్నప్పుడు అపూర్వ సుగంధం ఏదో వ్యాపించింది.

ఇప్పుడా వాసనలూ లేవు.

కాంతులూ లేవు.

మాధవరావు లేచి మంటపమంతా వెదికాడు.

గోడకు అవతలా ఇవతలా మళ్ళీ చూచాడు. చేత్తో ప్రతి శిల్పాన్నీతాకి చూచాడు.

"ఏమిటి సార్ చూస్తున్నారు? శిల్పాలనా సార్- వెన్నెలలో అవి ఇంకా అందంగా వుంటాయిసార్! ఇప్పుడిట్లావుంది కాని, గుడి మొత్తం బాగా వుండి వుంటే, ఓహ్! తాజమహల్ దీనిముందు ఎందు కాగుతుంది సార్?"

మాధవరావు మంటపంనుండి ఇవతలకి వచ్చాడు. అబ్దుల్లా గేటుదాకా గౌరవంగా సాగనంపాడు.

మాధవ్ ఇంటికిచేరేసరికి, లక్ష్మి ఆదుర్దాతో "ఇదేమిటండీ-ఇంత పొద్దుపోయింది? వరంగల్లులో ఏదైనా సినిమాకు వెళ్లారా?" అని అడిగింది —

మాధవ్ ఇదీ అదీ అనలేదు— శరీరాన్ని మంచంపై చేరవేశాడు. సొమ్మసిల్లినట్టు పడిపోయాడు.

# 4

"అన్నయ్యా! ఆయన రాత్రినుంచీ మన లోకంలోనే లేరు. తెల్లవార్లూ కలవరిస్తూనే వున్నారు. ఏమిటో త్రిసరాలట - తాటంకాలంట - మల్యాల గుండయ్యతో చెపుతాడట- నాకింక ఉద్యోగం వద్దు - నీదగ్గరే వుంటాను - అని కలవరిస్తున్నారు నిద్రలో. నాకేమిటో భయంగా వుంది" అని చెప్పింది లక్ష్మి కన్నీళ్ళు పెట్టుకొని.

రామచంద్రరావు తానే చౌరస్తాకు రావాలను కుంటున్నాడు. ఈ లోపలే లక్ష్మి వస్తుందని ఊహించ లేదు.

"మరేమీ భయంలేదు - నేను వస్తున్నాను పదమ్మా" అని ముందు కాత్యాయనిని తోడిచ్చి లక్ష్మిని పంపేశాడు. వెంటనే తన స్టడీరూంలోకి పోయి చరిత్ర తీశాడు.

ఎవరీ మల్యాల గుండయ్య??

ఏమిటీతాటంకాలూ, త్రిసరాలూ??

ఇవి కల్పిత పదాలా? లేక ఏమైనా అర్థంవుందా??

కాకతీయుల చరిత్ర తీశాడు.

రెండు నిమిషాలలోనే మల్యాలగుండయ్యచరిత్రలో దొరికాడు. మల్యాల గుండయ్య దండాధిపతుడు. రుద్రమ దేవికి కుడి భుజంగా వుండేవాడు. రాజకీయ వ్యూహరచన మొత్తం గుండయ్య ద్వారానే అమలు జరుగుతూ వుండేది. రుద్రమదేవికి జన్నగదేవసాహిణి అనే మంత్రి వుండేవాడు. త్రిపురాంతక దేవుడనే మరో మంత్రి వుండేవాడు. గన్నారెడ్డి అనే ఒక సేనానాయకుడు వుండేవాడు. వీరందరి మీదా మల్యాల గుండయ్య అధికారి.

త్రిసరము, తాటంకము అనేవి రెండూ కాకతీయుల నాటి రెండు ఆభరణ విశేషాలు. చాలా ఖరీదైనవి. గొప్ప గొప్ప ధన

వంతులు, నాట్యగత్తెలు, వేశ్యలు మాత్రమే వాటిని చేయించుకో గలిగేవారు.

వాటిలో కెంపులూ, వజ్రాలూ పొదిగేవారు. వాటి ప్రసక్తి క్రీడాభిరామంవంటి కాకతీయుల సమకాలీన గ్రంథాలలో వుంది.

రాం ఇంటికి తాళంవేసి బయలుదేరాడు. ఏ. జి. సెంటర్ తెలుగు శాఖలో పనిచేస్తున్న ఆనందరావు, చౌరస్తాలో కూరలు కొనుక్కొనే నిమిత్తం నడుచుకుంటూ వస్తున్నాడు.

రాం ఆయనను పలకరించాడు.

"తాటంకము అంటే ఏమిటండీ?" అని ప్రశ్నించాడు.

"తాటంకము అంటే, తాటాకుతో చేసిన ఒక ఆభరణం. తాటాకును గుండ్రంగా కత్తిరించి అంటించుకునేవారు మొదట. తర్వాత తాటాకును కత్తిరించి అంటిస్తే ఏ ఆకారం వస్తుందో, ఆ ఆకారంలో బంగారంతో దిద్దులుచేసి అందులో ముత్యాలో, రత్నాలో, రవ్వలో పొదిగి చెవులకు ధరించేవారు" అని వివరించాడు ఆనందరావు.

"ఆనందరావుగారూ! నాకు తెలుగులో ఏమైనా సందేహాలు వస్తే మీరు తీర్చాలి సుమండీ!"అన్నాడు రాం నవ్వుతూ.

"తప్పకుండా, అదీ అడగాలా? కాని, మీరేదో తమాషాకు అన్లాన్నారు కాని మీ పాండిత్యమేమితక్కువా?"

పరస్పర ప్రశంసలు ముగిశాయి.

ఇద్దరూ లష్కర్ బజారుదాటి ముందుకు నడుస్తున్నారు.

రాం దయ్యాల గూర్చి ఆనందరావును అడిగాడు.

"ఇది చాలా విచిత్రమైన టాపిక్. ఇదమిద్ధంగా తేల్చి చెప్ప లేము. నా మటుకు నాకు దయ్యాలు ఉన్నాయనే నమ్మకం" అన్నాడు ఆనందరావు.

"రావుగారూ! ఒక దయ్యం కాకతీయులనాటిది వుంటుందనుకోండి, అది ఏ భాష మాట్లాడుతుంది?" అని ప్రశ్నించాడు రాం.

ఆనందరావు కొంచెం ఆలోచించి, "దయ్యాలకు మనకంటే ఎక్కువ శక్తులుంటాయి. అందుకని అవి, ఏభాష కావాలంటే ఆభాష నేర్చుకుంటాయి. అలా నేర్చుకోదలచుకోలేదనుకోండి- అప్పుడా

దయ్యం కాకతీయులనాటి భాషనే మాట్లాడుతుంది" అన్నాడు ఆనందరావు.

"అఁ: అదీ సంగతి. కాకతీయుల వ్యవహారికానికీ మన వ్యవహారికానికీ ఏమిటి భేదం?"

"ఇప్పుడు శిలాశాసనాల్లో కనిపించేది వ్యవహారికం కాక పోవచ్చు. ఏ పండితుడో రాసి ఇచ్చిన గ్రాంధిక భాషను ఎవడో శాసనం మీద చెక్కుతాడు. ఆ చెక్కినప్పుడు కొన్ని తప్పులు కూడా దొర్లవచ్చు. అయితే కాకతీయులనాడు మాట్లాడే భాష ఏలా వుంటుందో మనకు తెలియదు. కాకుంటే ఇలావుంటుందని మనం ఊహించడానికి ఏవో కొన్ని ఆధారాలున్నాయి."

"ఆనందరావుగారూ! నాకు మీతో కొంచెం పనిబడింది. రేపో ఎప్పుడో వస్తాను."

"తప్పకుండా రండి. నేనెక్కడికీ వెళ్ళను" అన్నాడు ఆనందరావు.

చౌరస్తా వచ్చింది.

"నేనిక్కడ కూరలూ, వస్తువులూ కొనుక్కొని హసన్‌పర్తి బస్సులో తిరిగి వెళ్తాను" అన్నాడు ఆనందరావు.

రాం ఏనుగుల గడ్డకు పోయాడు.

మాధవ్ ముఖం కడుక్కొని కాఫీ తాగుతున్నాడు.

"ఏరా! ఎట్లావుంది ఒంట్లో?" అని అడిగాడు రాం.

"ఏమిటో నీరసంగా వుందిరా. అయినా లక్ష్మి హడావుడిగా మీ ఇంటికి వస్తుందని నాకు తెలియదు. చౌరస్తాకు వెళ్తుంటే కూరగాయలకనుకున్నాను."

లక్ష్మి రాంకు కాఫీ ఇచ్చింది.

తాగాడు.

లక్ష్మి, కాత్యాయని వంటగదిలో కూర్చొని మాట్లాడుతున్నారు.

"అరేయ్! అట్లా పైకి పోదాం పద" రాం పిలిచాడు. మాధవ్ లేచి మేడమెట్లు ఎక్కాడు.

రాం వెంబడించాడు.

ఇద్దరూ డాబా పైన ఆరుబయట కూర్చున్నారు.

"ఏరా! రాత్రి ఏం జరిగింది?" అని అడిగాడు రాం.

అలా అడిగే సరికే మాధవ్ వణికిపోయాడు.

గొంతు గాద్గదికమైంది.

"అరే రాం! ఆమె లేనిదే నేనిక బతకలేనురా!" అన్నాడు కన్నీళ్ళు పెట్టుకొంటూ.

"ఏమె?"

"ఆదే....ఆలయంలో సుందరి!"

"రాత్రి ఆమె కన్పడిందా?"

"ఆ! ఎన్నో విషయాలు మాట్లాడింది."

"చెప్పు, చెప్పు....ఏమన్నదో?"

మాధవ్ రాత్రి జరిగిందంతా వివరంగా చెప్పాడు.

రాం జాగ్రత్తగా విన్నాడు.

దీనితో రామచంద్రరావుకు కొన్ని సందేహాలు తీరిపోయాయి.

ఇప్పటి వరకూ లక్ష్మి చెప్పిన మాటల మీద కొన్ని అనుమానాలుండేవి.

మాల్యాలగుండయ్య, తాటంకము, త్రిసరము మొదలైన పదాలు మాధవ్ చదివిన ఏ పుస్తకంలోనైనా వచ్చి వుండవచ్చు. వాటిని రాత్రి కలవరించి వుండవచ్చునని అనుకొన్నాడు రాం మొదట.

ఇప్పుడా అనుమానం తీరిపోయింది.

ఆ పదాలేవీ మాధవ్‌కు పరిచయం లేవు.

అన్నీ ఆమె వాడినవే!!

అంతేకాదు, ఆమె మొదటిసారి మాధవ్‌కు కన్పడిన రోజు వైశాఖ శుద్ధ పూర్ణిమ.

ఆ రోజు పూర్ణిమ కాబట్టి,వెళ్ళాలని మాధవ్ వెళ్ళలేదు.

మాధవ్ గుడికి వెళ్ళాడు.

కాకతాళీయంగా ఆనాడు పూర్ణిమ అయింది.

ఆ రోజు రాత్రి ఆమె కన్పించింది.

తర్వాత మళ్ళీ కనిపించలేదు.

మళ్ళీ కన్పించింది.

నిన్నరాత్రి జేష్ఠశుద్ధ పూర్ణిమ.

పూర్ణిమనాడు చంద్రోదయం తర్వాత కొద్ది ఘడియలకు ఆమె వస్తున్నది. ఎంతసేపుంటున్నదో మరి! మళ్ళీ వెళ్ళిపోతున్నది.

దయ్యమైతే అమావాస్యనాడు రావాలి.

పూర్ణిమనాడు వస్తుందా??

అంటే....ఈమె దయ్యం కాదా? దేవతా??

లేక మనిషే ఎవరైనా ఇలా వస్తున్నదా??

"అరే మాధవ్! ఆమెను నీవు తాకావా?"

"ఆఁ, తాకాను."

"తాకితే ఎలా వుంది?"

"అదే చెప్పలేను. కలలో ఎవరినైనా తాకుతామే అలావుంది."

"ఆమె శరరీం నీకు తగిలిందా?"

"తగిలిందనీ చెప్పలేను, తగలలేదనీ చెప్పలేను." రాం అయోమయంగా చూశాడు మాధవ్ వంక.

"సరే కాని, ఇంకో ముఖ్య విషయం చెప్పు. ఆమె నీతో 'మందర నుంచి ఎప్పుడు వచ్చారు?' అన్నది కదూ?"

"ఔను, ఇప్పుడు కాదు క్రితంసారి అన్నది ఆ మాట."

"సరేలే! ఆమె ఆ మాటే అన్నదా?"

"ఆఁ! ఆ మాటే అన్నది."

"మాధవ్! నావైపు చూడు. నా ప్రశ్న జాగ్రత్తగా విను. ఆమె 'మందర నుంచి ఎప్పుడు వచ్చారు?' అనే అక్షరాలే అన్నదా, లేక వేరే వ్యవహారికం మాట్లాడిందా?...."

"ఓహో అదా! అవునురా, ఈ విషయం నీతో చెప్పాలనుకుంటున్నాను. ఆమె మాట్లాడే భాష మనం మాట్లాడే భాషకాదు. కొంత భేదంవుంది. 'మందర నుండి ఎన్నడు వచ్చినరు?' అన్నది.

'వచ్చినరు' అంటే 'వచ్చారు' అని అర్థం చేసుకున్నాను. మనం హైదరాబాదులో ఉర్దూవాళ్ళు తెలుగుమాట్లాడుతుంటే అర్థం చేసుకోవడంలేదూ అలాగే నేనీమె, మాటలను అర్థం చేసుకుంటున్నాను. అలాగే, నా మాటయూ ఆమె వెంటనే అర్థం చేసుకోవడం లేదు. కొంచెం ఆగి ఆగి ఆలోచించి అర్థం చేసుకుంటున్నది."

రాం ముఖం వికసించింది.

అతని మనస్సులో వున్న పెద్ద సందేహం తీరిపోయింది.

"అరే మాధవ్! ఆమె మాటల్లో నీకు కన్పడిన విశేషాలు చెపుతావా?"

"అంటే?"

"అంటే మనం మాట్లాడినట్లుగాకాక వేరే రకంగా వున్న శబ్దాలు"

"ఓహో! అదా" అని మాధవ్ ఆలోచించి జ్ఞాపకం చేసుకోవడానికి ప్రయత్నించాడు.

"రాం! వాక్యం చివరి క్రియారూపాలు మారుతున్నాయిరా! వరంగల్‌లో 'వచ్చిండు' అంటారు. కోస్తాలో 'వచ్చాడు' అంటారు. రాయల సీమలో 'వచ్చినాడు' అంటారుకదా! ఈమె 'వచ్చినేవు' అంటున్నది. 'ఎప్పుడు వచ్చావు' అనదానికి 'ఎన్నడు వచ్చినవు" అని అడిగింది.

"ఆc-ఆc! ఇంకా చెప్పు మాధవ్?" రాం ఉత్సాహంగా అడిగాడు.

"ఇంకా, వాడు అనడానికి 'వాండు' అన్నది. 'నీవు మారిపోయావు' అనడానికి 'నీవు మారిన పగిదివాెవున్న' వన్నది. 'ఈ దీపకంబము మీద ప్రమాణము చేయవా'? అన్నది. ఇంకా ఏవో చాలా చాలా అన్నది."

రాం మాధవ్‌ను కౌగిలించుకున్నాడు.

"ఏమిటి?" మాధవ్ అడిగాడు.

"మాధవ్! నాకు చాలా చాలా కొత్త విషయాలు తెలిశాయి!"

"అంటే?"

"అంటే ఏమిటో ఒకసారి పరిశీలించి కాని చెప్పలేను."

"మీ పరిశీలనలూ, పరిశోధనలూ నాకు తెలియదు. కాని, రాం! నేనామెను వదిలి జీవించలేను. నాకామె కావాలి!"

"అరే మాధవ్! ఈ మాటలు లక్ష్మి వింటే ఏమనుకుంటుంది?"

"రాం! నన్నలా భయపెట్టి చిత్రవధ చెయ్యకు. నేనామెను చూడకుండా ఉండలేనురా!"

"నిజమేకావచ్చు! కాని ఆమె మళ్ళీ ఇప్పట్లో నీకు కనిపించదు నా ఊహ నిజమైతే:" అన్నాడు రాం.

"ఎప్పుడు కనిపిస్తుంది?"

"మళ్ళీ వచ్చే పూర్ణిమనాడు చంద్రోదయం అయిన తర్వాత కన్పిస్తుంది. అదీ కొద్ది నిముషాలు మాత్రం!"

"ఎందువల్ల?"

"ఎందువల్లనో నేను చెప్పలేను. అది తెలిస్తే ఇంక కథే ముంది? అది తెలుసుకోవాలనే నా ప్రయత్నం."

"మొన్న నవ్వినట్లు ఏహో శబ్దాలు వచ్చినట్లు అనిపించింది."

"ఔను. అది చతుర్దశినాడుకదా! అదీ చంద్రోయం అయిన తర్వాత. అంటే శుక్ల చతుర్దశినాడు చంద్రోదయం తర్వాత ఆమె అలికిడి ప్రారంభమవుతున్నది, పూర్ణిమనాడు కన్పడుతున్నది. ఇలాగే ఇక ముందు కూడా జరుగుతుందా- లేదా? అన్నది చూడాలి. పూర్ణిమనాడు ఆ సమయంలో ఆమె నీకే కన్పడుతుందా? నాకు కూడా కన్పడుందా??

ఆమె ఎక్కడనుంచి వస్తున్నది??

ఎక్కడికి వెళ్తున్నది??

ఆమె నిన్ను 'సోమూ' అని ఎందుకు పిలుస్తున్నది??

ఆమె ఏదో 'అమ్మగారని' అంటున్నదే ఆ అమ్మగారెవరు?? రుద్రమదేవి కావచ్చా??

మాధవ్! పరిస్థితి వెనుకటికంటే ఇంకా అయోమయంగా వుంది. కాకుంటే రోజు రోజుకూ కొత్త కొత్త విషయాలేమిటో వస్తున్నాయి. వాటి ఆధారంగా మనమీ రహస్యాన్ని శోధించాలి"

"అదంతా నాకు తెలియదు. నాకామె కావాలి!"

"మాధవ్! నీవు పసివాడివికావు. పిల్లవాడు ఆకాశం మీది చంద్రుణ్ణి తెచ్చివ్వమన్నట్లుంది నీ సంగతి. ఆమె మనిషో, దయ్యమో ఇంకా పూర్తిగా తేలలేదు. ఆమె ఎందుకు వస్తున్నదో ఎందుకు పోతున్నదో తెలియడంలేదు. నీకోసంసారం వుంది, భార్యాబిడ్డలున్నారు. ఉద్యోగం వుంది. సమాజంలో స్టేటస్ వుంది. అట్లాంటది ఏ

గాలి దయ్యాన్నో చూచి 'నాకామె కావాలంటే' ఎవరైనా నీకు పిచ్చె క్కిందనుకుంటారు."

"అనుకోనీ! నాకు ఎటు తిరిగీ పిచ్చెక్కింది. నాకింక ఉద్యోగం వద్దు, సంసారంవద్దు. నాకామెయేకావాలి!"

రాం భయపడ్డాడు. మాధవరావుకు ఏదైనా గాలిసోకిందా??

'ఆ దయ్యం స్పర్శతో వీడి మనస్సు చలించలేదుకదా!' అనుకున్నాడు.

'హాయిగా హైదరాబాదులో బతికేవాడికి ఏం ఖర్మ వచ్చి పడింది? ఎందుకీ పాడు ట్రాన్స్ఫరు అయింది వీడికి?' అని బాధ పడ్డాడు. మాధవ్‌వంక చూశాడు.

మాధవ్ చూపులు మామూలుగాలేవు.

చంచలంగా వున్నాయి.

శూన్యంలో దేనినో వెతుకుతున్నాయి.

"సరే! ఇంక కిందికి పోదాంపద. మళ్ళీ ఆఫీసు వేళ అవుతుంది" అన్నాడు రాం.

"నాకాఫీసు వద్దు, ఉద్యోగం వద్దు, నేనిక ఏపనీ చేయలేను. నాకామె కావాలి!" అన్నాడు మాధవ్ ధృఢంగా.

రాం ఆందోళన పడ్డాడు.

కొంచెంసేపు ఆలోచించి "ఆమె నీదయ్యేటట్లు చేస్తాను. కాని, నీవు నా మాట వినాలి" అన్నాడు.

"వింటానురా! నీవు ఏంచేయమన్నా చేస్తాను" అన్నాడు మాధవ్.

"అయితే ఆఫీసుకుపోయి మామలుగా నీ పని చేసుకుంటూ వుండు. ఆమె ఇలా వచ్చిపోవడం కాకుండా శాశ్వతంగా నీకు దక్కేటట్లు చేస్తాను"

"రాం! నిజంగా చేస్తావా?" మాధవ్ జాలిగా అడిగాడు.

"ప్రమాణ పూర్తిగా చెబుతున్నాను. ఈ సమస్యకు త్వరలో నేను శాశ్వత పరిష్కారం సాధిస్తానని ఆ పద్మాక్షమ్మ మీద ఒట్టు వేసి చెపుతున్నాను. నువ్వు మాత్రం నేనుచెప్పినట్లు వినాలి" అని రాం మాధవ్ చేతిలో చెయ్యివేసాడు.

"వింటాను. తప్పకుండా నీమాటలు వింటాను" అని మాధవ్ లేచాడు. మెల్లగా మెట్లు దిగాడు.

అయితే మాధవరావులో వెనుకటి శక్తి లేదు, ఉత్సాహంలేదు. ఏదో యాంత్రికంగా దిగుతున్నాడు.

రామచంద్రకు కళ్ళ నీళ్ళు తిరిగాయి.'ఇంతటి చంచల స్థితిలో ఆఫీసులో మాత్రం ఎలా పని చేయగలడా?'అనిపించింది.

ఊళ్ళో ఎవరైనా ఘాత వైద్యులున్నారేమో కనుక్కోవాలని అనుకున్నాడు.

# 5

"ఇక్కడ జ్యోతిషము చెప్పబడును. బాణావతి, గాలి, బాలగ్రహ దోషములు బాగుచేయబడును- మంత్రవాది సారయ్య.''

సోమరాజు పవర్ క్రషర్ దాటాక, వరంగల్ వైపుపోయే హంటర్ రోడ్‌లో, ఒక పెంకుటింటి ముందు ఈ బోర్డు కనబడింది రామ చంద్రకు. ఎవరినో అడిగితే చెప్పిన గుర్తుల ప్రకారం అక్కడి దాకా వచ్చి అదే సారయ్య ఇల్లని పోల్చుకున్నాడు. లోపలికి వెళ్ళాడు.

అక్కడ కొందరు లంబాడీవాళ్ళు కూర్చొని వున్నారు.

"సారయ్య వున్నాడా?" వాళ్ళను అడిగాడు.

''ఉన్నాడు లోపల'' ఒక లంబాడీ జవాబు చెప్పాడు.

''ఏం చేస్తున్నాడు?''

''గాలి చేష్టను బాగు చేస్తున్నాడు దొరా!'' ఒక లంబాడీ చెప్పాడు. ఇంకో లంబాడీ చెప్పడం మొదలు పెట్టాడు- "వడ్డేపల్లిలో పునాదులు తవ్వుతున్నాం. అప్పుడు భూమిలోంచి వెళ్ళొచ్చింది దొరా, గాలి దయ్యం. మా ఆడదాన్ని పట్టింది. సారయ్య దగ్గరికి

తెచ్చినాం. దయ్యాన్ని భద్రకాళి చెరువులో కలుపుతానన్నాడు. లోపల దయ్యాన్ని సీసాలో బిగిస్తున్నాడు.''

రాం నమ్మలేకపోయాడు.

"ఏమిచ్చారు సారయ్యకు?"

''ఓ కోడీ, ఓ సారా సీసా. మా ఆడదాన్ని ఓ రాత్రి ఇక్కడ ఉంచినాం దొరా! రాత్రిళ్ళు ఒంటరిగా వుంచి నయం చేస్తాడట!''

ఈ మాటలు వినేసరికి ఇక అటునుండి అటే తిరిగి పోదామని పించింది రామచంద్రకు!

ఇంతదాకా వచ్చాక వెళ్ళడమెందుకు??

ఈ సారయ్య ఏ క్షుద్రదేవతా ఉపాసకుడో కావచ్చుకదా! అని రాం వాకిట్లోనే కాసేపు కూర్చున్నాడు.

కొంచెం సేపటికి సారయ్య వాకిట్లోకి వచ్చాడు.

''దొరా, దొరా!'' లంబాడీలు సారయ్యను చుట్టు ముట్టారు.

"అరే! గాలి దయ్యానికి ఇంకా మూడు కోళ్ళు కావాలట.'' అన్నాడు సారయ్య.

"బాంచనుదొరా! నీ కాళ్ళకు మొక్కుతా. కోళ్ళులేవు ఇంకా"

ఓ లంబాడీ సారయ్య కాళ్ళ మీద పడ్డాడు.

సారయ్య వాళ్ళను విదిలించుకొని దూరంగా జరిగాడు.

''అరే, గాడిద కొడకా! గాలి దయ్యం నీ ఆడదాన్ని తినేస్తుం దిరా— అప్పుడు లబో దిబోమంటే లాభంలేదు. చూసుకో మరి!''

''అయ్యో దొరా! కోళ్ళు ఎక్కడి నుంది తెత్తును?"

''ఏం చేస్తావో చేస్కో. సాయంత్రానికి కోడి కావాలి ఒకటి. పొండి, పొండింక''

గుంపును బయటికి తోలేశాడు సారయ్య.

రామచంద్ర ఒక్కడే మిగిలాడు.

రామచంద్ర వైపు పైకీ కిందికీ చూశాడు సారయ్య- ''ఊం- ఊం! ఇది బాణావతి చేష్ట. పద లోపల ముగ్గులో కూర్చో."

"ఎవరు?" రాం అడిగాడు.

"నీవే! నీ దయ్యం సంగతి తేలుస్తా."

"దయ్యం నాకు కాదు....."

రాం మాటను సారయ్య వినిపించుకోలేదు.

"దయ్యం పట్టినోడెవడూ నాకు దయ్యమని ఒప్పుకోడు. రారా!"

రామచంద్ర మాట్లాడబోయాడు.

సారయ్య చూరులోంచి ఓ వేపమండను గుంజి రెండుసార్లు ఝుళిపించి "మేడారం సమ్మక్కా! సారలమ్మా! షీ-షీ" అని అరిచాడు.

రాం నివ్వెరబోయి చూస్తున్నాడు.

"ఆ మాపు, అసలైన దయ్యం చూపు. రా! ముగ్గులో రాకో!" అని మళ్ళీ అరిచాడు సారయ్య.

రామచంద్ర మాట్లాడబోయాడు.

సారయ్య రాంను మాట్లాడనివ్వలేదు.

"బాబో! దయ్యం నాకుకాదు" గబాలున పెద్దగా అరిచాడు రాం.

"యాద్గిరీ! యాద్గిరీ!" సారయ్య కేక పెట్టాడు.

యాదగిరి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"పట్టుకో-పట్టుకో ఈయన్ని. నాకు దయ్యం లేదంటూ అరుస్తాండు."

యాదగిరి రామచంద్రరావును చూశాడు.

"దొరా! ఈనెవరో నీ కెరికేనా? (ఈయనెవరో నీకు తెలుసా!)" యాదగిరి సారయ్యతో అన్నాడు. సారయ్య అనుమానంగా చూశాడు.

"మన సుబేదారి కాలేజీలో, సారు (టీచర్)"

"గట్లానా! నాకేమెరిక? (అట్లాగా! నాకేం తెలుసు!)" అన్నాడు సారయ్య క్షమాపణ కోరుతున్న కంఠస్వరంతో.

"రండి, సారూ! రండి" లోపలికి ఆహ్వానించాడు సారయ్య రామచంద్రను.

రాం, యాదగిరి ఇద్దరూ లోపల గదిలోకి పోయారు. సారయ్య కూర్చున్నాడు.

ప్రక్కనే యాదగిరి కూర్చున్నాడు.

ఎదురుగా రాం కూర్చున్నాడు.

సారయ్య అడిగాడు, "ఏం పనిమీద వచ్చినారు సారూ.... మిమ్మల్ని నేను చూడలే ఇంతకు ముందు"

"మా స్నేహితుడొకడికి దయ్యం కనిపిస్తున్నది. దాన్ని గూర్చి అడుగుదామని వచ్చాను" అన్నాడు రాం.

"గట్లనా! మంచిది- మంచిది. యాదగిరీ! పుస్తె ప్రశ్నగిటు పట్టకరా"

యాదగిరి ఓ దస్త్రం తెచ్చి సారయ్య కిచ్చాడు.

సారయ్య నాలుగు వచ్చిపోకలు నోట్లో వేసుకొని మూడు తమలపాకులకు సున్నంరాసి కొంచెం జర్దాసేపి నోట్లో పెట్టు కున్నాడు.

"సారూ! మీరో పువ్వు పేరు చెప్పండి?"

"మల్లెపువ్వు" అన్నాడు రాం.

"మల్లెనా? గట్లా గట్లా చెప్పండి" అంటూ లేచి తుపుక్కున ఉమ్మేసి వచ్చి మళ్ళీ కూర్చున్నాడు.

"సారూ! ఓ దేముడి పేరు చెప్పండి:"

"స్వాయంభువు!"

"గదేం పేరు సారూ?"

"అదె మన ఖిల్లా దగ్గర లేదూ?"

"గది శంభుని గుడిసారూ!"

"అదే నేనన్నది"

"గట్లనా! శంభుడు" అని వల్లించుకున్నాడు సారయ్య.

"సారూ! మీకు నచ్చిన ఓ పండు పేరు చెప్తరూ?"

"మామిడి పండు"

"గట్లనా! మామిడి పండు" అని సారయ్య రెండు మూడు సార్లు అనుకున్నాడు.

మళ్ళీ లేచి ఒక్కసారి గటుక్కున ఉమ్మేశాడు.

"మల్లె, మామిడి, శంభుడు. సారూ! ఇది భానుమతే! అను మానంలేదు. జల్దీ మనిషిని తీసుకురండి, కోషిష్ చేయకండి (ఆలోచిస్తూ కూర్చొవద్దు)"

"భానుమతా! అంటే?" రాం ప్రశ్నించాడు.

"చెప్పరా భానుమతిని గూర్చి" సారయ్య యాదగిరిని పనికి పురమాయించి మళ్ళీ బయట ఉమ్మేసివచ్చాడు.

యాదగిరి భానుమతి అంటే ఏమిటో వివరించాడు. సగం తెలుగు సగం ఉర్దూ కలిసిన భాషలో.

అతడు చెప్పిన విశేషమేమిటంటే తెలంగాణా పల్లెల్లో భానుమతి అనే విద్య బాగా వ్యాప్తిలో వుంది. దీనినే బాణావతి అనీ, చేతబడి అనీ అంటారు. మనకు ఎవరిమీదనైనా ద్వేషం వుంటే, ఒక మంత్రవేత్తను పిలిచి అతడి సాయంతో మన శత్రువు మీదికి ఈ భానుమతిని ప్రయోగించాలి.

హంటర్ రోడ్ దగ్గర స్మశానంలోకి అర్థరాత్రి పూట ఓ బొమ్మను తీసుకొని పోవాలి. దాని మీద మేకులు దిగగొట్టాలి. బొమ్మకు కాళ్ళూ చేతులూ కట్టేయాలి. కాస్త సారా మంత్రగాడు తాగి మరి కొంచెం బొమ్మకు తాగించాలి. (గుడ్డ బొమ్మ అయితే సారాలో తడుస్తుంది. కొయ్యబొమ్మ అయితే ఊరికే బొమ్మ నెత్తిని కాసిని చుక్కలు చల్లాలి) ఆ తర్వాత పిండితో ముగ్గుపెట్టి ఆ ముగ్గు మీద పసుపూ కుంకుమా చల్లి నిమ్మకాయలు కోయాలి. కోసి బొమ్మను ఆ ముగ్గు మధ్య పెట్టాలి. దీనితో బాణావతి ప్రారంభమవుతుంది.

మంత్రగాడు ఒక ఏముకతో ఇక్కడ బొమ్మ పొట్ట మీద కొడితే అక్కడ శత్రువు కడుపు నొప్పితో గిల గిల కొట్టుకుంటాడు. ఇక్కడ బొమ్మతల తిప్పితే అక్కడ శత్రువు తల తిరిగి కిందపడి పోతాడు. మంత్రగాడు ఇక్కడ బొమ్మకు ఒక చేయి విరిస్తే, అక్కడ శత్రువు ఎముక ఫ్రాక్చరై పోతుంది.

ఇదీ కథ.

యాదగిరి చెప్పిననదంతా రామచంద్రరావు విన్నాడు.

మధ్యలో రాం ఏదో ప్రశ్న వేయబోయాడు కాని, సారయ్య చేతి సైగతో వారించాడు.

ఆ తర్వాత సారయ్య తాను నయం చేసిన కొన్ని బాణామతి కేసులూ, తాను ప్రయోగం చేసిన కొన్ని బాణామతి కేసులూ చెప్పాడు. అన్నీ కథలు చెప్పినట్లు చెప్పాడు. సారయ్య ఒకరి ఇంటి మీదికి ప్రయోగం చేశాడట! ఇంకేముంది?? ఆ ఇంట్లో పెట్టెలో గుడ్డలు పెట్టెలోనే ఉండేవి, లోపలివి లోపల తగలబడి పోయేవి. ధాన్యం బస్తాలలోనే వుండేది. విప్పి చూస్తే లోపల బూడిద. పచ్చళ్ళు జాడీల లోనే వుండేవి, తీసిచూస్తే లోపల పురుగులు.

ఉన్నట్లుండి రాత్రికి రాత్రి ఇంటిమీద రాళ్ళువచ్చి పడేవి.

నాలుగు దిక్కుల నుండి ఒకేసారి వచ్చిపడేవి. వెళ్ళి చూస్తే ఎవరూ కన్పడేవారుకాదు.

సారయ్య ప్రయోగించే దయ్యాలు ఒక్కొక్కప్పుడు ఆ శత్రువు ఇంటి ముందు ఎముకలతో ముగ్గులుపెట్టి రక్తంతో బొట్లు పెట్టి వచ్చేవి.

సారయ్య గట్టిగా, "సారక్కా! సమ్మక్కా!" అని అరిస్తే చాలు మేడారంనుంచి రెండు దేవతలు అడవి మధ్యగుండా పరుగెత్తు కొంటూవచ్చి గుమ్మంలో నిలబడి "ఏమి, ఆజ్ఞ?" అని వినయంగా నమస్కరిస్తాయి.

మేడారంలో పెద్ద జాతర జరుగుతుంది.

దానికి లక్షలాదిమంది జనం వెళ్తారు.

ఓ కోయపిల్లవాడు వెదురు బొంగులు పట్టుకొని పరుగెత్త డంతో జాతర ప్రారంభమవుతుంది.

సారయ్య ఆ జాతర సమయంలో సారలమ్మను ఉపాసిస్తాడు. దానితో అతడికి సారలమ్మ ప్రత్యక్షమై భానుమతి శక్తులు ఏయేటి కాయేడు ఇస్తుంటుంది. ఇదీ సారయ్య చెప్పిన వృత్తాంతం.

రాం అంతా శ్రద్ధగా విన్నాడు.

వింటున్నకొద్దీ రాం మనస్సులో ఏదో భయం బయలుదేరింది.

ఇదంతా నిజమా? అబద్ధమా??

అనవసరంగా తానో మంత్రవాది చేతుల్లో ఇరుక్కోవి పోలేదు కదా?

ఇతడు చెప్పేవన్నీ నిజమే అయితే, కోపం వస్తే సారయ్యే తన మీద ఓ సీసాలోంచి గాలిదయ్యాన్ని తీసి ప్రయోగిస్తాడో-ఏమో!

"పో. నాలుగు కోళ్ళూ, రెండుసారా సీసాలూ తీసుకురా. లేకుంటే చూడు" అని స్మశానంలో రాం బొమ్మను ముగ్గులమధ్య పెట్టి మేకులుకొడితే.

రాం ఇలా ఆలోచించే సరికి గుండెదడ బయలుదేరింది.

"సారయ్యా! ఇప్పుడు మనం ఎవరికీ భానుమతి (చేతబడి) చేయనక్కరలేదు. మా వాడికొకడికి దయ్యం కనిపిస్తున్నది. అది నిజమా- అబద్ధమా? అట్లా ఎందుకు కనిపిస్తున్నది? అది తెల్సుకోవాలి" అన్నాడు రాం.

"గదే, సారూ! నేను చెప్తున్నది. ఎవరో మీ దోస్తు (స్నేహితుడి) మీద భానుమతిని తోలిన్రు. దాన్ని మనం తిప్పి కొట్టాలె. అప్పుడా భూతం తోలినోణ్ణి తిండిపెట్టమంటది. గొర్రెల్ని తెమ్మంటవి, బర్రెల్ని తెమ్మంటది. పెట్టలేకపోతే చివరకు వాణ్ణే విరుచుకు తింటది.... అరే యాదిగిరీ! వాకిట్లోకెవరో వచ్చిండ్రు సూడు."

రాంతో సారయ్య ఈ విషయాలు చెప్తుండగానే ఇంకో లంబాడీ వాడు వచ్చాడు.

ఆ లంబాడీవాడికి రాత్రిపూట కలలు వస్తున్నాయట. అందులో భూతాలు కనబడుతున్నాయట.

"ఒక్క నిమిషంసారూ!" అని రామచంద్ర కేసును ప్రక్కన బెట్టి సారయ్య లంబాడీవాడి కేసును పట్టుకున్నాడు. ఎందుకంటే లంబాడీ కేసు ఎమర్జన్సీలాగుంది.

"అరేయ్‌ ఇటురా!"

లంబాడీవాడు వచ్చాడు.

"కూకో!"

కూర్చున్నాడు.

"యాదిగిరీ! కోడిగుడ్డు ఇటుపెట్టు."

యాదిగిరి కోడిగుడ్డు తీసుకుపోయి సారయ్యా ముందు పెట్టాడు.

సారయ్యా కోడిగుడ్డులో చూశాడు.

"ఆఁ-ఆఁ! గుడ్డు మీద నీ దయ్యం కన్పడిందిరా. ఇది లంబాడీ దయ్యమే."

"ఔ-ఔ. మొన్న మా చిన్న మామ చచ్చిండు."

"ఆఁ! వాడే. దయ్యమై నిన్ను పట్టాడు."

"దయ్యం నాకు కాదు. మా ఆడోళ్ళకి."

"ఓహో! గట్లనా! నీకు కాదా?" అని సారయ్యా కోడిగుడ్డును పైది కిందికీ కిందిది పైకీ తిప్పి. "ఆఁ- ఆఁ! గిప్పుడు నీ పెళ్ళాం కన్పిస్తున్నదిరా కోడి గుడ్డులో. ఇంకబో. రెండు కోళ్ళూ. పదిరూపాయిలూ తీసుకురా. రేపు మబ్బులో (తెల్లవారగట్ల) రా!"

"అట్టో! పదిరూపాయలేడ తెత్తాను"

"సాలే! (ఓ తిట్టు) దయ్యం పెళ్ళాన్ని పీక్కతింటే అది చస్తే సౌరుపమా (వందరూపాయలు) నుక్సానవుతోది (దండగ అవుతాయి) పది రూపాయలకు ఏడుస్తవు. పోరా చే, పో."

సారయ్యా కోడిగుడ్డు ప్రశ్న చెప్పటం ముగించి లంబాడీ వాణ్ణి తరిమేశాడు.

రాం ఈ తంతునంతా పరిశీలిస్తూనే వున్నాడు. సారయ్యా దగ్గరికి అంతా లంబాడీలే ఎక్కువగా వస్తున్నారు. ఈ సారయ్యలాంటి వాళ్ళు తెలంగాణాలో అన్ని గ్రామాల్లోనూ వున్నారట.

గ్రామ ప్రజలను బెదిరించి కోళ్లూ, మేకలూ, సారాయి ఈ

మంత్రగాళ్ళు గుంజుకుంటుంటారని, అమాయికులైన లంబాడీ స్త్రీలను చెరుస్తూ వుంటారనీ లోగడ రాం విన్నాడు.

ఇప్పుడు కన్నాడు.

'బుద్ధి తక్కువై వచ్చాను' అని చెంపలు వేసుకున్నాడు రాం. సారయ్య మళ్ళీ లోపలికి వచ్చాడు.

"సారూ! దయ్యం పట్టినోడు ఎక్కడున్నడు? తోలుకొస్తరా (తీసుకొని వస్తారా?)"

"ఆయన చౌరస్తాలో బ్యాంకిలో వున్నాడు- పెద్ద ఉద్యోగి."

సారయ్య నివ్వెరపోయాడు.

"గట్లా! చౌరస్తా బాంకిలోనా? అవు, నేను మొన్న 'లోను'కు దరఖాస్తు ఇచ్చ్చింటిని సారూ!" అని సారయ్య ఆలోచనలో పడ్డాడు.

కొంచెంసేపు ఆలోచించి, "సారూ! వరంగల్‌లో అకార పోళ్ళ గుడిదగ్గర జాలాపతి లింగయ్య వున్నడు. ఆయన దగ్గరికి పోండి సారూ! గిదేదో పెద్ద కేసు లెక్కనున్నది" అని పుష్పం ప్రశ్న దస్త్రాన్ని చుట్టిపేశాడు.

బ్యాంక్ ఆఫీసరు అనే సరికి సారయ్య జారుకోవడంచూసి, యాద్గిరి మూతికి చెయ్యి అడ్డం పెట్టుకుని చాటుగా తనలో తాను నవ్వుకున్నాడు.

ఆ నవ్వుకు యాద్గిరి కనుబొమ్మలూ, బుగ్గలూ ఊగుతున్నాయి. రాం 'బతుకు జీవుడా' అని బయట పడ్డాడు.

# 6

ఆషాఢశుద్ధ త్రయోదశి వచ్చింది.

"మాధవ్! రేపు చతుర్దశి. ఎల్లుండి పూర్ణిమ. మన ఎక్స్‌పరిమెంటు మళ్ళీ మొదలు పెట్టాలి రేపు. నా ఊహ ప్రకారం రేపు

నవ్వులు వినపడతాయి. ఎల్లుండి మనిషి కనపడుతుందే." అన్నాడు రాం మాధవితో.

"రాం! నేనింక ఈ వియోగాన్ని భరించలేనురా-"

అలా పిచ పలుకులు పలికి లాభంలేదు. సమయం వస్తున్నది సద్వినియోగం చేసుకోవాలి మనం. ఈ అవకాశం దాటిపోతే మళ్ళీ నెంబాకా దిక్కులేదు" అన్నాడు రాం.

"అరేయ్! ఈసారి గుడిలో నువ్వుకూడా నాతోబాటు కూర్చోరా!" అన్నాడు మాధవ్.

రాం ఆలోచించాడు.

"అలాగే! కాని మరో మనిషి వున్నాడని ఆమె అసలే రాక పోతే...."

"అదీ- నిజమే!" అన్నాడు మాధవ్ ఆలోచిస్తూ.

"పోనీ- ఇలా చేద్దాం. ఈసారికి నేను రాను. మామూలుగానే నీవొక్కడివే వెళ్ళు. అక్కడ ఒక టేప్ రికార్డరు పెడదాం. అది మీ ధ్వనుల నన్నింటినీ రికార్డుచేస్తుంది. అలాగే నీవొక కెమేరా తీసు కొనిపో. వీలుచూచుకొని ఓ ఫోటోతియ్యి. ఈ సారికి ఈ ఎక్స్పరి మెంటు చాలు." అన్నాడు రాం.

మాధవ్ 'సరే' నన్నాడు.

"ఇంకో విషయం గుర్తుంచుకో! ఆమెతో మాట్లాడేటప్పుడు సాధ్యమైనన్ని ఎక్కువ వివరాలు సేకరించేందుకు ప్రయత్నించు. ఆమె పేరు కూడా తెలుసుకో."

"ఎలారా?" అన్నాడు మాధవ్.

రాం కొంచెం ఆలోచించి, "ఆమె నిన్ను సోమూ అంటున్నది- అంటే ఆమె దృష్టిలో నీ పేరేదో సోమశేఖరుడో, సోమసుందరుడో అయివుంటుంది. 'మందరనుంచి ఎప్పుడు వచ్చావు?' అని అడుగు తున్నది: అందుకని నీవు ఇలా చెయ్యి. 'మందరలో నాకు జబ్బుచేసి జ్ఞాపకశక్తి తగ్గిపోయింది. నిన్ను గుర్తుపట్ట లేకుండా వున్నాను"

అను. దానితో ఆమె తనను నీచేత గుర్తుపట్టింప కోవడంకోసం తన విషయాలన్నీ చెప్పితీరుతుంది. వాటి నన్నింటినీ మన టేప్ రికార్డు చేస్తుంది. ఎలావుంది ఐడియా?"

"భేషుగ్గా వుంది" అన్నాడు మాధవ్.

ఆషాఢశుద్ధ చతుర్దశి వచ్చింది.

శిథిలమంటపంలో ఓరాతి పక్కన సాయంత్రం టేప్ ఆన్ చేసి రాం రోడ్డుమీదికి వచ్చేశాడు.

తర్వాత మాధవ్ వెళ్లాడు.

కొంచెం సేపటికి చంద్రోదయమైంది.

మాధవ్ పరిశీలనగా చూస్తున్నాడు.

చంద్రోదయమైన కొద్ది క్షణాలకు నవ్వులు వినిపించాయి. అవే నవ్వులు! అదే కంఠ స్వరం!

సెలయేరు పారినట్టు, చంద్రుడు ద్రవించి స్రవించినట్లు. వీణలు వేగంగా మీటినట్టు-

వేయి కోకిలలు కూసినట్టు-

కిల కిలా నవ్వులు- కల కలా నవ్వులు!

మాధవ్ మంటపమంతా తిరిగాడు.

కొంచెం సేపుండి నిట్టూరుస్తున్న ధ్వనులు.

తనలో తాను ఓ స్త్రీ ఏడుస్తున్న శబ్దం....

మాధవ్ గడియారం చూచుకుంటున్నాడు.

ఆ శబ్దాలను శ్రద్ధగా గమనిస్తున్నాడు-

ఎటునుంచి వస్తున్నాయో పోల్చుకోవాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు.

కొంతసేపట్టికి ధ్వనులు ఆగిపోయాయి.

మాధవ్ మళ్ళీ గడియారం చూసాడు.

రేడియం డైల్‌లో టైమ్‌ను పోల్చుకున్నాడు. నవ్వులు మొదలైన దగ్గరినుంచి ఓ పదిహేను నిమిషాలపాటు ధ్వనులు వినిపించినట్టు తేలింది.

మాధవ్ అలాగే మరికొంతసేపు కూర్చున్నాడు. ఏమీ ప్రయోజనం కన్పించలేదు.

తొమ్మిదిగంటలైన తర్వాత మాధవ్ టేప్‌ను తీసుకొని బయటకు వచ్చాడు.

రోడ్డుమీద రాం అలాగే నిలబడి వున్నాడు.

"ఏరా! ఏమయింది?" ఆదుర్దాగా ప్రశ్నించాడు రాం.

"ఆమె మళ్లీ నవ్విందిరా!"

"వెరీగుడ్! ఇంకా?"

"టైం నోట్ చేశాను. సరిగ్గా ఏడు గంటలనుండి ఏడుంబావు వరకు విన్పించాయి నవ్వులు, నిట్టూర్పులు."

"వట్స్ గుడ్! పదిహేను నిమిషాల డ్యూరేషన్‌లో జరుగుతున్న దన్నమాట ఈ కథ. ఇక ఇంటికి పద."

ఇంటి ముఖంపట్టారు ఇద్దరూ.

మాధవ్ రీడింగు రూంలోకిపోయి తలుపులు వేసుకున్నారు.

మెల్లగా టేప్ ఆన్ చేశాడు.

రామచంద్రా, మాధవ్, ఇద్దరూ ఆత్రుతతో టేపువంక చూస్తున్నారు.

టేప్ తిరగడం మొదలు పెట్టింది.

రాం, మాధవ్, ఒకరు ముఖం ఒకరు చూచుకున్నారు.

టేప్ తిరుగుతున్నది నిశ్శబ్దంగా!

ఏ నవ్వులూ లేవు, ఏ నిట్టూర్పులూ లేవు!

"ఏమిట్రా ఇది?" రాం అడిగాడు.

"అదే నాకు అర్థం కావడంలేదు. నేను స్పష్టంగా నవ్వులు గలగల విన్నాను. నిట్టూర్పులు విన్నాను" అన్నాడు మాధవ్.

"నీవు వినడమన్నా అబద్ధం కావాలి. లేక టేప్ రికార్డర్ చెడిపోయైనా వుండాలి" అని రాం రికార్డరును పరిశీలించాడు.

రికార్డ్‌ను ఆన్‌చేసి మాధవ్ మాటలను నాల్గింటిని రికార్డు చేశాడు.

చక్కగా విప్పించాయి.

రాం తెల్లబోయాడు.

"నేను విన్నదీ నిజమే, రికార్డరు చెడిపోనిదీ నిజమే! అంటే ఆమె ధ్వనులను ఈ రికార్డర్ రికార్డు చేయడంలేదని అర్థం" అన్నాడు మాధవ్ ఆలోచిస్తూ.

"అయివుండవచ్చు!" అన్నాడు రాం కూడా కొంచెం ఆలోచించి.

"అరే మాధవ్! అదే నిజమయ్యే పక్షంలో రేపు కెమెరా ఆన్‌చేసి పెట్టడం కూడా ఇక వ్యర్థమే. ఆమె ధ్వని రికార్డరుకు అందనప్పుడు ఆమె రూపం కూడా ఫ్లాష్‌కు అందకపోవచ్చు."

"అయితే రేపు ఏం చేయమంటావు?" అన్నాడు మాధవ్.

"రికార్డరు ఆన్ చేసి వుంచుదాం ఇవ్వాల్టిలాగే. నష్టమేముంది? కెమేరా మాత్రం తీసుకొని పోవద్దు. కెమేరాతో ఎక్స్‌పరిమెంటు అవసరమైతే నేను మరోసారి వచ్చి చేస్తాను స్వయంగా" అన్నాడు.

"రాం! నా బతుకును ప్రయోగశాలలోనే గడుపుతావా? నాకామె దక్కుతుందా-దక్కదా?"

మాధవ్ దిగులుగా ముఖం పెట్టాడు.

రాం మాధవ్ చుబుకాన్ని పట్టుకొని వూపి, జాలిగా ఓ నవ్వు నవ్వాడు.

"పొద్దుపోయింది. నేనిక వెళ్తాను. రేపు సాయంత్రం ఏడు నుండి ఏడుంబావువరకు, పదిహేను నిమిషాలు ఆమె మాట్లాడుతుంది. సిద్ధంగా వుండు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

తెల్లవారింది.

ఆషాఢ శుద్ధ పూర్ణిమ వచ్చింది.

ఉదయమే లేచి రాం ఆనందరావు ఇంటికి వెళ్ళాడు. ఆనందరావు ఏదో చదువు కుంటున్నాడు.

"రండి... రండి! ఏమిటిలా ఉదయమే వచ్చారు!" అని ఆహ్వానించాడు ఆనందరావు రామచంద్రను.

"ఏదో చదువుతున్నట్లున్నారు. డిస్టర్బ్ చేశానా?" అంటూ రాం లోపలకి వచ్చాడు.

"లేదు, లేదు. ఫస్టియర్ ఎడ్మిషన్స్ కాలేదు. సెకండియర్ క్లాసెస్ మాత్రం మొదలు పెట్టాం మొన్ననే. లెక్చర్స్ ప్రిపేరవుతున్నాను. ఆఁ, ఏమిటీ విశేషాలు?"

రామచంద్ర తన నోట్సును ఆనందరావుకు చూపించి విషయం వివరించాడు.

ఆనందరావు దానిని శ్రద్ధగా పరిశీలించాడు.

పరిశీలించిన తర్వాత ఇలా అన్నాడు—

"దీపకయిం అనేది వైరి సమాసం. దీనిని పన్నెండవ శతాబ్దపు కవులు వాడారు. ముఖ్యంగా పాల్కురికి సోమనాధుని వంటి వారు. సోమనాధుడు వరంగల్‌వాడు. వరంగల్లులో పన్నెండో శతాబ్దంలోని వ్యవహారిక పదాలు చాలా ఆయన గ్రంథస్థం చేశాడు. అలాగే 'వాడు' అనే రూపం కూడా ఆనాటిదే! 'వాడు' అనడానికి వాళ్ళు 'వాండు' అనేవారు. 'పగిదివోలె' అని మనము అనము. 'ఈ వెన్నెల అమృతంవలె వుంది' అంటాము. లేదా 'అమృతం పగది వున్నది' అని రాస్తాము. కాని పన్నెండో శతాబ్దంలో 'వెన్నెల అమృతం పగిది వోలే వున్నది" అనేవారు. దీనిని ఉపమావాచక ద్విరుక్తి అంటాం మేము వ్యాకరణంలో. దీనినిబట్టి ఈ వాక్యాలూ, ఈ భాషా, కాకతీయుల నాటిదని స్పష్టమవుతున్నది" అని తేల్చి చెప్పాడు ఆనందరావు.

రాం దీర్ఘంగా ఆలోచించి నిట్టూర్చాడు.

ఈ పదాలన్నీ మాధవ్ కల్పించలేదనీ, నిజంగానే వున్నాయనీ తేలిందన్నమాట!!

ఈ మాటలన్నీ ఆమె అంటున్నది.

ఆమెకు ఇరవయ్యవ శతాబ్దపు భాష తెలియదు. పన్నెండవ శతాబ్దపు తెలుగులో మాత్రమే మాట్లాడుతున్నదని స్పష్టమైంది ఇప్పుడు.

"ఆనందరావుగారూ! పని పడ్డప్పుడు మళ్ళీ వస్తాను" అని లేచాడు రాం.

"పని పడకపోయినా మీరు వెంట వెంట రావాలి. ఇది బొత్తిగా నిర్జన ప్రదేశం. ఓ అరణ్యంలా వుంటుంది. చెట్లులేని అరణ్యం. అందుకే దీనికి విద్యారణ్యం అని పేరుపెట్టారు మా వాళ్ళు" అన్నాడు ఆనందరావు. రాం ఆనందరావు ఇంటినుండి బయట పడ్డాడు. ఇంటికిపోయి స్నానం, భోజనం ముగించి కాలేజీకి వెళ్ళాడు.

కాలేజీలో వున్నాడనేకాని మనస్సంతా ఎక్కడో ఆలోచిస్తూనే వుంది.

'నాకు తెలుసు. మాధవ్ ఆఫీసులో కూర్చొని వుంటాడే కాని అతడి మనస్సు మనస్సులో వుండదివ్వాళ" అనుకున్నాడు రాం.

మెల్లగా సాయంకాలమైంది.

పదహారు కళలతోనూ ఆకాశంలో వ్యోమ గురువు వికసించాడు వ్యాసపూర్ణిమనాడు.

టేప్-రికార్డర్ ఆన్ చేసి ఓ స్తంభం చాటున పెట్టి మాధవ్ కూర్చున్నాడు.

చంద్రోదయమై అప్పుడే కొద్ది గడియలైంది.

ఉన్నట్లుండి శిథిల మంటపం విచిత్రమైన కాంతితో మెరిసింది. ఇదివరకెన్నడూ చూడని కాంతి.

మంటపంలో తూర్పు వైపున ఒక శిల్పం వుంది.

ఆ విగ్రహం పశ్చిమ దిశగా ముఖంపెట్టబడి వుంది.

ఆ విగ్రహం ఎందుకో ధగధగా మెరిసినట్లు కనిపించింది మాధవరావుకు.

విస్మయంతో మాధవ్ అటే చూస్తున్నాడు.

విగ్రహం కదిలినట్లనిపించింది.

విగ్రహంలోనుండి గాజుల గలగలలు విన్పించాయి.

'నాకేదో భ్రమకలుగుతున్నది. నా మనస్సుచలిస్తున్నది' అనుకున్నాడు మాధవ్.

ఒకసారి తన శరీరాన్ని తానే గిల్లిచూచుకున్నాడు-నొప్పి పుట్టింది.

'అంటే ఇది కలకాదు, భ్రమకాదు. నిజమేనన్నమాట' అనుకున్నాడు.

ఇలా అనుకునే లోపలే అందాల సుందరివచ్చి, మాధవ్ ఎదుట నిలబడివుంది.

అదే రూపం- అదే హొయలు- అవే వేషభూషణలు!

ఈమె ఎటునుండి వచ్చింది?

విగ్రహం చాటునుండా?

విగ్రహం లోపలినుంచా?

లేక విగ్రహం కింద ఏదైనా రహస్య సొరంగంవుందా?

అందులోనుంచి వస్తున్నదా?

వస్తే ఎందుకు వస్తున్నది!?

ఇలా ఆలోచించే లోపలే చిరునవ్వు నవ్వుతూ, 'సోమూ!' అని ఆమె పలకరించింది.

ఆ నవ్వులు పారిజాతాలు రాలినట్లు జారాయి మంటపంలో. ఇవ్వాళ ఆమె ఎందుకో లోగడకన్నా నూరింతలు అందంగా వుంది.

ఆమె కళ్ళల్లో కోటి స్వయంప్రభలు వెలుగుతున్నాయి పెదవులమీద దానిమ్మ పువ్వులశోభ-

చెంపలు కెంపులై మెరుస్తున్నాయి.

సమున్నతమైన వక్షస్థలంమీద ఆమె దాల్చిన సన్నని వస్త్రం పాము కుబుసంలా రెప రెపలాడుతున్నది

ఆమె మాధవ్ దగ్గరకు వచ్చింది.

రెండు చేతులతోనూ మాధవ్ పాదాలకు నమస్కరించింది.

మాధవ్‌కు తాకీ తాకనట్లు అనిపించింది.

ఏదో గాలి తగిలినట్లు-

ఏదో కలలో జరుగుతున్నట్లు.

'సోమూ!' ఆప్యాయంగా పిలిచింది ఆమె. వచ్చి మాధవ్ పక్కనే కూర్చున్నది.

మాధవ్ చేతులను తన చేతులలోకి తీసుకున్నది. మాధవ్‌కు చేతులను ఎవరో అదృశ్యశక్తి కదిలిస్తున్నట్లు అనిపించింది.

అప్రయత్నంగానే చేతులను కదిలించాడు.

ఆ రెండుచేతులనూ ఆమె ముద్దుపెట్టుకొంది.

మాధవ్ రెండు అరచేతులనూ తన బుగ్గలకు ఆనించుకొంది-

"సోమూ! ఏమిటి మాట్లాడవు? ఎందుకు పూర్వంలా కబుర్లు చెప్పవు?"

"నాపేరు సోముయేనా!" మాధవ్ ప్రశ్నించాడు.

ఆమె నివ్వెరపోయింది. "మందరలో నీకెవరైనా మందు పెట్టారా ఏమిటి? ఇందులూరి అన్నయ్య ఎందుకైనా సమర్థుడే! నీ పేరు నీవు మరచిపోయావా?"

"ఔను దేవీ! నేను మరచిపోయాను. నాకేమిటో అంతా భ్రమ కలుగుతున్నట్లుగావుంది. వెనుకటి విషయాలేవీ జ్ఞాపకం రావడం లేదు....ఇలా ఎందుకు జరుగుతున్నదో తెలియడంలేదు!" మాధవ్ రాం చెప్పిన పాఠం చక్కగా వల్లించాడు.

"సోమూ-సోమూ! ఎందుకిలా అయిపోయావు సోమూ? నీ దేవినే నీవు మరచిపోయావా? ఎంతకాలానికీ నీవు రాకపోతే నేనప్పుడే అనుకొన్నాను-ఇలాంటిదేదో జరిగివుంటుందని...." ఆమె కన్నుల వెంట ముత్యాలు రాలాయి.

అవి చెంపలమీదుగా జారి మాధవ్ రెండుచేతులలోనూ పడ్డాయి.

మాధవ్‌కు రెండు నీటిబిందువులు తాకీ తాకనట్లు అనిపించింది.

"సోమూ! నీకేమీ జ్ఞాపకం రావడంలేదా?"

"లేదు దేవీ! నాకెందుకో గతమంతా మరచిపోయినట్లనిపిస్తున్నది. నీవెవరో నాకు తెలుసు. కాని నాకేమవుతావో ఏం పరిచయమో గుర్తుకు రావడంలేదు...."

ఈ మాటలు విని ఆమె భోరున ఏడ్చింది.

ఓరుగల్లు చుట్టూ వున్న ఏడు చెరువులూ ఒక్కసారి ఘూర్ణిల్లినట్లు అనిపించింది.

ఆమె మాధవ్ చేతుల్లో వాలిపోయింది.

ఎత్తైన ఓరుగల్లు రాతికోట జలజలా రాలిపోయినట్లనిపించింది.

"సోమూ! నన్ను కూడా మరచిపోయావా సోమూ. నా పేరు కామసాని అనికూడా నీకు గుర్తు లేదా...."

'ఓహో! ఈమె పేరు కామసానియా?'

"ఔను. నా పేరు కామసాని అనీ, నిన్ను నేను ముద్దుగా దేవీ అని పిలుస్తాననీ గుర్తువుంది. కాని నేనెవరో నాకు గుర్తుకురావడం లేదు దేవీ!"

ఆమె మళ్ళీ ఏడ్చింది.

"సోమూ! నీకు మతిభ్రమణం కలిగింది. మందర గోళకీమఠంలోని శివాచార్యుడు నీమీద ఏదైనా ప్రయోగం చేశాడో ఏమో? అయ్యో! ఎంతకష్టం వచ్చింది నాకు?" ఆమె మళ్ళీ ఏడ్చింది.

"సోమూ! నీపేరు భళ్ళాల సోమేశ్వరుడని నీకు గుర్తుకు రావడంలేదా?"

"దేవీ! నీవు చెపితే నాకు గుర్తుకువస్తున్నది!" కామసాని లేచి కూర్చున్నది.

"ఈ విషయమేదో అమ్మగారితో చెప్పి తేలుస్తాను. నీకు మతిభ్రమణం కల్గించిందెవరో తెలుసుకొని వాళ్ళను పద్మాక్షిగుడిముందు ఎనుమును నరికినట్లు నరికిస్తాను"

"ఏ అమ్మతో? చిన్నమ్మతోనా- పెద్దమ్మతోనా?"

మాధవ్ ఏదో అనాలి కాబట్టి అన్నాడు.

ఎవరో చిన్నమ్మ ఒకతె, పెద్దమ్మ ఒకతె ఉండకపోతారా-అని.

"చిన్నమ్మతో ఎందుకు చెపుతాను? ఇందులూరి అన్నయ్యగారి అందాలరాణి ఆమె. నాకు ఆమె సహాయం చేస్తుందా? పెద్దమ్మగారితోనే చెపుతాను. కదంటే ఆమె దర్బారులోనే ప్రాణత్యాగం చేస్తాను."

మాధవ్ జాగ్రత్తగా ఆమె మాటలన్నీ గుర్తుపెట్టుకొంటున్నాడు.

"సోమూ! నీకు నామీద ప్రేమ పోయిందనీ, రుయ్యమ్మ నీకేదో చేసిందనీ నేనూహిస్తూవచ్చాను. కాని నీకు గతాన్నంతా మరచిపోయేటట్లుచేసి నామీదినుంచి నీ మనస్సును మళ్ళిస్తారని మాత్రం నేనూహించలేకపోయాను సోమూ!"

ఆమె మళ్ళీ దుఃఖిస్తున్నది.

మాధవ్‌కు ఏమిచేయాలో తోచలేదు.

'ఓహో! ఏడ్చినా ఈమె ఎంత అందంగా వుంది?' అని మాత్రం అనుకున్నాడు.

దుఃఖంతో కామసాని కళ్ళు ఎర్ర కలువలైనాయి.

"సోమూ! నేనేం చేయగలను సోమూ?"

"దేవీ! నీవేమీ అనుకోకపోతే నాకో సహాయంచెయ్యి! నాకొక్కొక్క విషయమే మెల్లగా గుర్తుచేయడానికి ప్రయత్నించు. నేను జాగ్రత్తగా నా మనస్సును స్వాధీనంలో వుంచుకొని అన్నీ గుర్తుకు తెచ్చుకుంటాను. దీనివల్ల నామతి భ్రమణం పోవచ్చు"....

"అలాగే- అలాగే చేస్తాను సోమూ! కాని, నాకీ విషయం ముందు చెప్పు. గోళకీ మఠంలో నీకు ఎవరైనా ప్రయోగం చేసినట్లు అనుమానం వుందా?"

"ఎవరు చేసివుంటారంటావు దేవీ?"

"శివాచార్యుడేమైనా చేశాడా? ఒకవేళ రుయ్యమ్మ చెపితే తప్ప నిజానికి ఆయనకు చేయవలసిన అవసరం లేదు. కాని శివా

చార్యుడు సర్వసమర్థుడు. కేవలం తన మంత్రశక్తితోనే మూడు వందల జైనమందిరాలను కృష్ణ నుండి మంచికొండ వరకు నిర్మూలించాడు. విశ్వేశ్వరశంభు దేశికుల ప్రథమ శిష్యుడు శివలింగ శివాచార్యుడే ఈ పని చేశాడని నా ఊహ."

"కావచ్చు....కావచ్చు." అన్నాడు మాధవ్ ఏమనాలో తెలియక.

"లేక నీ శిల్ప సౌందర్యాన్ని విని సహించలేక, మహాదేవ రాజు దేవగిరిలో ఏదైనా ప్రయోగం చేయించాడా?— లేక నాయన గారిచేత పరాభవించబడ్డ జైన బౌద్ధ గురువులెవరైనా చేశారా? పాలమూరు కవతల కృష్ణా తీరానికి పారిపోయిన సారిపుత్తుడు ఈ పని చేసినా చేయవచ్చు."

"అతడికి నామీద ఎందుకంత కక్షవుంటుంది?"

"ఎందుకైనా వుండవచ్చు. వాళ్ళ మందిరాల నన్నిటినీ శివాలయాలుగా నీవే నాయనగారి కోరికతో మారుస్తున్నావు కదా! అందుకు కావచ్చు. లేకుంటే ఇంత మార్పు నీలో కలుగదు—నీ వేషం నాకర్థం కావడం లేదు. నీ భాష కూడా మారిపోయింది. నీవు మాట్లాడేది త్రిలింగమో, పారశీకమో, తెలియనంతగా మారిపోయింది. అతికష్టం మీద అర్థం చేసుకొంటున్నాను"

"జరిగిన దానికి బాధ పడి లాభం లేదు—ఇప్పుడు నీవొక పని చేయాలి దేవీ!"

"ఏమిటి సోము?"

"నాకు గతాన్నంతా జ్ఞాపకం చెయ్యి. దానివల్ల నామతి భ్రమణం తగ్గిపోతుందని నా విశ్వాసం—"

"అలాగే సోమూ!....విను" అని ఆమె తన పమిట చెంగుతో తన కన్నీళ్ళను తుడుచుకున్నది.

మాధవ్ ఆమె ఏమి చెపుతుందోనని శ్రద్ధగా వింటున్నాడు.

మాధవ్ ఆమెను చూస్తూనే వున్నాడు.

ఉన్నట్టుండి శిధిల మంటపంలో వెలుగు ఒక్కసారిగా తగ్గినట్లనిపించింది—

చూస్తూండగానే ఆమె అదృశ్యమై పోయింది.

మాధవ్ నివ్వెర పోయాడు.

గడియారం చూసుకున్నాడు.

ఆమె వచ్చినప్పటి నుండి పదిహేను నిమిషాలు గడిచింది అప్పటికి—

మాధవ్ మంటపంనుండి ఇవతలికి వచ్చాడు.

నంది కవతల అబ్దుల్లా కూర్చొని వున్నాడు.

"అబ్దుల్లా- అబ్దుల్లా! బయట గేటు వద్ద ఒకాయన నిలబడి వుంటాడు చూడు-ఇటు రమ్మను."

అబ్దుల్లా వెళ్ళి, బయటనే నిలబడి వున్న రామచంద్రరావును పిలుచుకొని వచ్చాడు.

రాం శిధిల మంటపం లోపలికి వచ్చాడు.

"ఏమయిందిరా—ఏం మాట్లాడింది?"

"తర్వాత చెపుతాను—ఇప్పుడే చూస్తుండగానే ఆమె అదృశ్యమైపోయింది. రావడం మాత్రం ఇదుగో, ఈ గుమ్మంవైపు నుండి వచ్చింది. వెళ్ళడం ఎటు వెళ్ళిందో తెలియ లేదు."

రాం అటూ ఇటూ చూశాడు.

టార్చి లైటుతో మంటపంలోని ప్రతి రాయినీ పరిశీలించాడు.

"ఏం సార్! ఏమైనా పామో, పురుగో వచ్చిందా?" అబ్దుల్లా ప్రశ్నించాడు.

"లేదులే అబ్దుల్లా!" మాధవ్ అన్నాడు.

"ఏమో సార్! మీరు చీకట్లో ఒక్కరే గుడిలో కూర్చుంటున్నారు. ఎందుకో తెలియదు. దేవుణ్ణి ధ్యానం చేస్తే ఇక్కడ ఈ నంది ముందు కూర్చోండి సార్ - అక్కడ పాములూ వుంటాయి. దయ్యాలూ వుంటాయి."

"గుడిలో దయ్యాలుండవు. అవి దేవుణ్ణి చూస్తే పారి పోతాయి" అన్నాడు రాం నవ్వుతూ.

"నిజంగానా! అయితే ఈమె దయ్యం కాదా:" అన్నాడు మాధవ్.

"దయ్యం కాదు - దేవత!" అని రాం టేప్ రికార్డ్‌ను తీసు కున్నాడు.

"పద మాధవ్! పని అయిపోయింది. ఇంక ఆమె కన్ప డదు ఇవ్వాళ" అన్నాడు రాం.

ఇద్దరూ రోడ్డుమీదికి వచ్చారు.

అబ్దుల్లా గేటుతలుపు వేసుకున్నాడు.

"అరేయ్! ఆమెకూ, నీకూ ఇవ్వాళ ఏం సంభాషణ జరి గిందిరా:" రాం ప్రశ్నించాడు అలంకార్ టాకీస్ వైపు నడుస్తూ.

మాధవ్ జరిగినదంతా చెప్పాడు.

రాం శ్రద్ధగా వింటున్నాడు.

"నేను, నీవు చెప్పినట్లే మతిభ్రమణం కలిగినట్లు నటించాను రాం, ఆమె ముందు. అది విని ఆమె 'సోమూ! నీ గత చరిత్రనంతా గుర్తుచేస్తాను. దానివల్లనయినా నీవు నా వాడివి కావచ్చు నన్నదిరా!'

"భేష్! మంచి పనిచేశావు, గత చరిత్ర ఏమని చెప్పింది?"

"చెప్పుదామనుకుంటున్నది..ఇంతలోనే అదృశ్యమైపోయింది."

"అంటే పదిహేను నిమిషాలు అయిపోయా యన్నమాట. మళ్లీ కన్పడ్డప్పుడు ఆమె నీ కథా తన కథా తప్పకుండా చెపు తుందిరా:"

"ఎప్పుడు?"

"ఎప్పుడంటే. మళ్లీ కన్పడ్డప్పుడు. అంటే మళ్లీ వచ్చే పూర్ణిమ నాటికి."

మాధవ్ తెల్లముఖం వేశాడు.

ఆషాఢపూర్ణిమ వెన్నెలలో మాధవ్ తెల్లముఖం వేసినట్లు స్పష్టంగా గమనించాడు రాం.

ఇద్దరూ అలంకార్ టాకీస్‌కు ఇవతల కాకతీయ కాలనీకి పోయేవైపు ఓ తూము గోడమీద కూర్చున్నారు. రాం టేప్ ఆన్ చేశాడు.

టేప్ బర బరా తిరిగింది నిశ్శబ్దంగా.

రాం, మాధవ్‌లు ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. టేప్ తిరుగుతూనే వుంది- మధ్య మధ్య మాధవ్ మాటలు విన్పడుతున్నాయి రికార్డులో.

అలా పదిహేను నిమిషాలసేపు టేప్ తిరగటం గమనించి రాం అన్నాడు, "అరేయ్! నీవు అన్న మాటలన్నీ రికార్డు అయినాయి. ఆమె చెప్పిన చిన్నమాటకూడా రికార్డు కాలేదు?"

"ఎలారా అయితే?"

"చూద్దాం- కానీ కథ ఏమవుతుందో?"

"అరె రాం! ఆమె నన్ను ప్రేమిస్తుదిరా- నేనూ ఆమెను ప్రేమించాను."

"నోరుముయ్ మాధవ్! ఆమె మనిషో, పన్నెండో శతాబ్దపు దయ్యమో ఇంకా తేలనేలేదు. ఆమె చేతికి తగలడంలేదు, మాటలు రికార్డరుకు అందడం లేదు. అట్లాంటివి మీరిద్దరూ ప్రేమించుకోవడమేమిటి? అది నెరవేరడమెలాగా??-

ఇదేమీ సామాన్యమైన విషయంకాదు- సృష్టిలో ఎక్కడా నేను కనీ వినీ ఎరుగని విషయం-

అలాంటిది నీవు పసిపిల్లవాడిలా ప్రవర్తిస్తే కథ మొత్తం రసాభస మవుతుంది- కాస్త ఓర్పువట్టు. ఏమవుతుందో చూద్దాం"

మాధవ్ ఊరుకున్నాడు గుండెలోని దిగులును అప్పటికి గుండెలోనే దిగమింగి.

మర్నాడు ఉదయం రాం, ఆనందరావు దగ్గరికి పోయాడు. జరిగినదంతా వివరించాడు. ఇద్దరూ పన్నెండో శతాబ్దపు చరిత్రలూ, ఆనాటి సాహిత్య గ్రంథాలు తీశాడు.

మాఘప్కూ, ఆమెకూ విన్న జరిగిన సంభాషణలో కొన్ని పేర్లూ, సంఘటనలూ వచ్చాయి. కామసాని, భళ్ళాక సోమేశ్వరుడు, రుయ్యమ్మ, ఇందులూరి అన్నయ్య, శివాచార్యుడు, చిన్నమ్మ (అన్నయ్యగారి అందాలరాణి), పెద్దమ్మ, విశ్వంభర శంభు దేశికులు, సారిపుత్రుడు, పాలమూరు, నాయనగారు, దేవగిరి మహాదేవుడు. ఇవన్నీ నిజమా? కల్పిత పదాలా? అని గమనించారు.

కల్పిత పదాలు కావు.

అన్నీ పన్నెండో శతాబ్దపు చరిత్రకు సంబంధించినవే.

కామసాని, భళ్ళాల సోమేశ్వరుడు అన్న పేర్లు దొరకలేదు చరిత్రలో.

మిగిలిన పేర్లు దొరికాయి.

రుయ్యమ్మ రుద్రమదేవి కూతురు.

ఇందులూరి అన్నయ్యగారి భార్య.

అన్నయ్యగారి అందాలరాణి 'చిన్నమ్మ' అంటే రుయ్యమ్మే కావచ్చు.

పెద్దమ్మగారి దర్బారు అంటే, రుద్రమదేవి దర్బారా? మరి నాయన గారంటే ఎవరు?

గణపతి దేవుడు కావచ్చు.

విశ్వంభర శంభుదేశికుడు గణపతిదేవునికి వీరశైవదీక్ష నిచ్చిన ఆరాధ్య గురువు.

ఆ పేరూ చరిత్రలో దొరికింది.

సారిపుత్రుడూ, శివాచార్యుడూ ఈ రెండు పేర్లూ దొరకలేదు.

పాలమూరు అంటే మహబూబ్ నగర్ జిల్లా.

"రుద్రమదేవి మీదికి దేవగిరి యాదవరాజైన మహాదేవరాజు మూడు లక్షల సైన్యంతో క్రీ. శ. 1260-70 మధ్య ప్రాంతంలో దండయాత్రకు వచ్చాడు. రుద్రమదేవి అతడిలో పదిహేనురోజులు యుద్ధంచేసి ఓడించి తరిమివేసింది" అన్నాడు రాం, ఆనందరావుతో.

"రామచంద్రరావుగారూ! మీరు చెప్పిన వివరాలనుబట్టి, ఈ ఛళ్ళాల సోమేశ్వరుడనే వ్యక్తి కాకతీయ గణపతిదేవుని కాలంలో ఉండే, ఒక శిల్పి అని అర్థమవుతున్నది. కామసాని అనే వ్యక్తికూడా ఆ కాలపు స్త్రీయే. వీరిరువురూ ప్రేమించుకున్నారు.సోమేశ్వరుణ్ణి గణపతి దేవుడు శివాలయాలు నిర్మించేందుకు ఉపయోగించుకున్నాడు. అలాగే జైన మందిరాలను కూడా రాజాజ్ఞతో ఈ సోమేశ్వరుడు శివాలయాలుగా మార్చినట్లు తెలుస్తున్నది. ఇతడెందుకో గోళకీ మఠానికి పోయాడు. బహుశా దాని నిర్మాణానికి కావచ్చు. ఆ తర్వాత ఏమయిందో మనకు తెలియదు." అన్నాడు ఆనందరావు.

"సోమూ! నీకు ప్రయోగంచేసిన వాడిని పద్మాక్షిగుడిముందు ఎనుమును నరికినట్లు నరుకుతానన్నది కామసాని- మన మాధవ్‌తో" అన్నాడు రాం.

"రామచంద్రరావుగారూ! ఇలా ఎనుబోతులను అమ్మవారి గుడిముందు నరకడం పన్నెండో శతాబ్దపు సాంఘికాచారమే. శ్రీ కృష్ణదేవరాయలుకూడా ఒక ఎనుబోతును అడవినుండితెస్తే, విశ్వనాథ నాయకుడనేవాడు ఒకే వేటుతో ఏనుగంతటి దున్నను నరికినట్టు వుండికదా!" అన్నాడు ఆనందరావు.

"ఈ వివరాలనుబట్టి యీ కామసానీ- సోమేశ్వరుల ప్రణయం పన్నెండో శతాబ్దపు కథ అని తెలుస్తున్నది" అన్నాడు రాం.

"అయితే మాధవ్‌ను ఆమె సోమేశ్వరుడని ఎందుకు పిలుస్తున్నది? ఇంతకూ ఆమె ఎవరు? మనిషా- దయ్యమా? ఎక్కడినుంచి వచ్చి ఎక్కడికి పోతున్నది?"

"ఆనందరావుగారూ! ఈ ప్రశ్నలకు సమాధానాలు రావాలంటే ఇంకా కొంతకాలం ఎదురు చూడాలి. కనీసం వచ్చే పూర్ణిమ దాకా నన్నా"

"ఆమె పూర్ణిమ నాడే ఎందుకు కన్పడుతున్నది, మాధవరావు గారికి?" ఆనందరావు అడిగాడు.

"అదీ ఇంకా ప్రశ్నార్థకంలోనే వుంది. దీని జవాబుకోసం కూడా ఎదురు చూడవలసిందే మనం".

# 7

శ్రావణశుద్ధ పూర్ణిమ వచ్చింది.

మాధవరావు గొడుగు వేసుకొని వేయి స్తంభాలగుడికి వచ్చాడు **సాయంత్రం.**

ఆకాశంనిండా మేఘాలు-

సన్నగా జల్లుకూడా పడుతున్నది.

మాధవరావు ఈ నెలరోజుల్లోనూ బాగా చిక్కిపోయాడు. టైఫాయిడ్ రోగి లేచి నడుస్తున్నట్లుగా బలహీనంగా నడుస్తూ, గుడి లోపలకి వెళ్ళాడు.

శిథిలమంటపం దగ్గరికి వెళ్ళాడు.

వాన జల్లుకు బండలు తడిసి వున్నాయి.

సన్నటి పాముల్లాగా వాననీళ్ళు విరిగిన రాళ్ళమధ్యకు జారు తున్నాయి.

మాధవరావు గడియారం చూచుకొని, ఓ రాతిమీద కూర్చున్నాడు.

అక్కడ కొంచెం పొడిగావుంది.

గొడుగు ముడిచాడు.

చల్లటి గాలులు రివ్వున వీస్తున్నాయి.

'ఏ క్షణాన్నైనా తుఫాను రావచ్చు. కనీసం ఈమె కన్పడే పదిహేను నిమిషాలూ రాకపోతే చాలు' అని దేవుడికి దణ్ణం పెట్టు కున్నాడు.

బహుశా చంద్రోదయమయ్యే వుంటుంది.

కాని నీలంరంగు నీళ్ళు కడుపునిండా తాగి, ఎత్తైన పొట్టలతో

ప్రసవానికి సిద్ధంగావున్న నల్లని స్తన భావంకల మేఘాలు చంద్రుణ్ణి పూర్తిగా కప్పివేశాయి.

మాధవ్ గడియారం చూస్తూ కూర్చున్నాడు.

శిధిలమంటపంలో మెరుపులు మెరిసినట్లనిపించింది.

శిల్పమూర్తి కదిలినట్లనిపించింది.

క్షణంలో కామసాని మాధవ్‌ముందు సాక్షాత్కరించింది.

మాధవ్ ముఖం నల్ల కలువ అయింది.

కామసాని శ్రావణలక్ష్మిలా వెలుగుతున్నది.

మాధవ్ చాతకంలా కూర్చున్నాడు.

"సోమూ! నీగత జీవితమే నీవు మరచిపోయావా?" అన్నది వస్తూనే.

'ఆఁ- ఆఁ!' అన్నాడు మాధవ్.

"పాలమూరులో నీవు జన్మించిన కొద్ది కాలానికే తల్లిదండ్రులు స్వర్గస్థులైనారు. మల్యాల గుండయ్య అప్పటికింకా అమ్మగారి కొలువులో చేరలేదు. గుండయ్యగారి ధర్మపత్ని కుప్పమ్మ నిన్నుచూచి ముచ్చటపడి చేరదీసి స్తన్యమిచ్చింది. 'మల్యాల చానమ్మ కొడుకు మల్యాల సోమేశ్వరుడే అవుతాడు కాని, భళ్ళాళ సోమేశ్వరుడని వాడిన్నీ పిలవకండి' అని కుప్పమ్మ అందరితోనూ అనేది. ఆ చిన్నతనమంతా నీవు మరచిపోయావా సోమూ?"

"అవును. కొంచెం కొంచెం గుర్తుంది. చిన్నప్పుడే మనిద్దరం కలిసి ఆడుకునే వాళ్ళం."

"వాల్లే నీ చమత్కారం- వెర్రికుదిరింది, తలకు రోకలిచుట్టు అన్నాడట ఒకడు వెనుకటికి ఇలాగే-

ఇదేనా జ్ఞాపకం రావడం??

చిన్నప్పుడు నన్నెక్కడ చూచావు నువ్వు?

నేను పాలమూరుకెందుకొచ్చాను?

మా అమ్మ నాకప్పుడు అంతఃపురంలో ప్రేరణనృత్యం నేర్పుతూ వుండేది."

మాధవ్ చెవులు రిక్కించుకొని వింటున్నాడు.

ఆకాశం గర్జిస్తున్నది మధ్య మధ్య.

కామసాని మళ్ళీ మొదలుపెట్టింది.

"మల్యాల గుండయ్యగారు అమ్మగారికి దండనాయకుడైనాడు. పాలమూరునుండి వారి కుటుంబం ఓరుగల్లు వచ్చేసింది. నీవు దేవర కొండవద్ద ముదిగొండ అగ్రహారంలో విశ్వేశ్వర మందిర నిర్మాణా నికై ఉలిచేతబట్టి, మిగిలిన శిల్పులతోబాటు పాలమూరినుండి వలస వెళ్ళావు. గుర్తొస్తున్నదా సోమూ? జ్ఞాపకం తెచ్చుకో."

"ఆఁ-ఆఁ! కొంచెం కొంచెం జ్ఞాపకమొస్తున్నది!"

"విశ్వేశ్వర మందిర నిర్మాణం జరుగుతువ్నప్పుడు నీవు చెక్కిన లతలను విశ్వంభర శివాచార్యులవారు చూచారు ఒకనాడు. నాయనగారే శివాచార్యులవారిని స్వయంగా వెళ్ళి చూడమని ప్రార్థించ డంతో, శివాచార్యులవారు ఓరుగల్లునుండి వచ్చారానాడు. ఆలయ మంతా పరిశీలించారు.

నీవు చెక్కిన లతలు గురువుగారి దృష్టి నాకర్షించాయి.

"ఎవరు చెక్కారు వీటిని?" అని ప్రశ్నించారు రాజగురువు.

"భళ్ళాళ సోమేశ్వరుడని మావాడు చెక్కాడు" మీ శిల్పుల నాయకుడు నిన్ను రాజగురువుకు పరిచయం చేశాడు.

విశ్వంభర శివాచార్యులవారు నిన్ను తీక్షణంగా ఒకసారి పైనుండి కిందికీ, కింది నుండి పైకీ చూచారు.

"చిరంజీవీ! నీవా ఈ లతలను చెక్కింది? చాళుక్య శిల్ప కళలో కొత్తరీతిని ఎలా కనిపెట్టావు బాబూ?" అని ప్రశ్నించారు నిన్ను.

'ఏమో నాకు తెలియదు. ఇలా చెక్కితే బాగుంటుందని అని పించింది. చెక్కాను' అన్నావు నీవు. గుర్తుందా?....

"ఆఁ- ఆఁ!"

"అప్పుడు రాజగురువు ఏమన్నారు."

"సోమేశ్వరా! చిరుతకొక్కటినాదేఇలాంటిశిల్పనైపుణిప్రదర్శిం చడం గురుముఖంగా నీవు నేర్చుకున్న విద్యకాదు, పూర్వజన్మసుకృతం.

శివానుగ్రహం" అని నిన్ను ఆశీర్వదించారు. నీవాయన పాదాలకు శరణు చేశావు.

అప్పుడు నీలోకి ఏదో విద్యుత్తు శివాచార్యులవారినుండి ప్రవహించినట్లనిపించిందని నాతో చెప్పావు. గుర్తుందా?"

"అలా నీతో చెప్పానా?"

"చెప్పలేదా సోమూ—నీవు చెప్పకపోతే ఈ విషయాలన్నీ నేను చూచానా ఏమిటి?"

"ఔను. చెప్పే వుంటాను."

"చెప్పేవుంటాను కాదు సోమూ- చెప్పావు. మనిద్దరికీ పరిచయం అయిన తర్వాత ఒకనాడు సంపెంగ వనంలో చెప్పావు"

"ఈ సంపెంగ వనం ఎక్కడ?'' అని మాధవ్ అడుగుదామనుకొని, ఏమనుకుంటుందోనని ఊరుకున్నాడు మళ్ళీ.

కామసాని మళ్ళీ చెప్పడం మొదలుపెట్టింది.

"గణపతి దేవ సార్వభౌములకు బీజాక్షరసహిత పంచాక్షరిని ఉపదేశంచేసిన రాజగురువు విశ్వంభర విశ్వేశ్వర శివాచార్యులవారి స్వగ్రామం ముదిగొండ. ప్రభువులవారి కోరికమీద శివాచార్యులవారు రాజధానికి వచ్చినా, తన అగ్రహారంమీద ఆయనకు మమకారం తీరలేదు. ఆయన దయవల్లనే నేటికీ అగ్రహారంలోని ఐదువేల ఆరాధ్య కుటుంబాలకు నిత్యజీవనావసరానికై కావలసిన సమస్త సాహిత్యం నాయనగారే ఇస్తున్నారు."

నాయనగారంటే గణపతిదేవుడని మాధవ్ అర్థంచేసుకున్నాడు.

సాహిత్యమంటే, భోజనపదార్థాలని తెలంగాణంలో వ్యవహారిక రూపం వున్నట్లు మాధవ్ లోగడ ఒకసారి విని వున్నాడు.

"విశ్వంభర విశ్వేశ్వర శివాచార్యులవారు నిన్నుగూర్చి ప్రభువులవారికి ఏకాంతంలో చెప్పారు. "గణపతిదేవా! భళ్ళాళ సోమేశ్వరుడు దేవశిల్పి. కుమారస్వామి అవతారం. మన కాకతీయ సామ్రాజ్యపు దేవాలయవైభవంకోసం పరమశివుడే ఈ చిన్నవాణ్ణి

కైలాసంనుంచి పంపించాడు. రాజధానిలో పుండదగ్గ ప్రజ్ఞాశాలి ఈ బాలుడు" అన్నారు.

నాయనగారు ఇందులూరి అన్నయ్యగారినీ, మల్యాలగుండయ్య గారిని పిలిచి ఏవో రాజకీయాలు మాట్లాడుతూవున్న సందర్భంలో దేవాలయాల ప్రసక్తి వచ్చింది.

"వివాహ సంబంధాలద్వారా రాజకీయ బాంధవ్యాలను పెంపొందించుకోవడం ఒక వ్యూహం. అలాగే ఆలయాలద్వారా, కళలద్వారా ప్రజలలో సమైక్యతను సాధించడం ఒక అంతరంగిక వ్యూహం. వీటిని మనం అనుసరించి, కాకతీయ రాజ్యాన్ని సుస్థిరంచేయాలి." అన్నారు ఇందులూరి అన్నయ్య.

అప్పుడు ప్రభువులు స్వయంగా నీ ప్రసక్తిని వాళ్ళవద్ద తెచ్చారు.

"శివుడు మనకోసం మన సామ్రాజ్యంకోసం దేవశిల్పులను పంపిస్తున్నాడు" అని నీ గూర్చి నాయనగారు వాళ్ళతో అన్నారు.

అది విని మల్యాల గుండయ్య ఫక్కున నవ్వాడు.

"వాడు మా పెంపుడు కొడుకు" అన్నాడు గుండయ్య. అని నీ బాల్యాన్నిగూర్చి ప్రభువులవారితో చెప్పాడు గుండయ్య.

"అట్లాంటిది మన రాజధానికి ఎందుకు తీసుకురాలేదు నువ్వు ఆ బాలుణ్ణి?" అని ప్రశ్నించాడు నాయనగారు.

"నేనే స్వయంగా తెస్తే ఆశ్రితపక్షపాతమని అనరా? స్వయం ప్రతిభతో తనంతతానే సోమేశ్వరుడు పైకి రాగలడని నా విశ్వాసం. అది అప్పుడే నిజమయిందికూడా!" అన్నాడు మల్యాల గుండయ్య.

ఈ విధంగా నీవు రాజధానికి నాయనగారిచేత పిలిపించబడ్డావు. సోమూ! ఈ విషయమంతా ఒకసారి నీ సమక్షంలోనే నాయనగారు రుద్రమదేవిగారితో చెపుతుండగా విని, నీవు నాతో సంపెంగ వనంలో కలిసినప్పుడు చెప్పావు. గుర్తొస్తున్నదా?"

"ఆఁ- ఆఁ! జ్ఞాపకం వస్తున్నదిదేవీ! నీవు చెపుతుంటే అన్నీ కలలోలాగా గుర్తుకొస్తున్నాయి."

"నిజంగా, జ్ఞాపకంవస్తున్నదా?" కామసాని ఆనందబాష్పాలు రాల్చింది.

మాధవ్‌ను రెండుచేతులతోనూ కావలించుకుంది. కామసాని చేతులు మాధవ్‌కు తగిలీ తగలనట్లనిపించింది.

ఏదో వెలుగు తన చర్మంమీద పాకినట్లు-

ఏదో వెన్నెలగడ్డకట్టి కరచరణాద్యవయవాలతో నిలిచి తనను స్పృశించినట్లు-

"సోమూ! నిజంగా నీకు జ్ఞాపకశక్తి మళ్ళీ వచ్చిందా? నేనెంత అదృష్టవంతురాలిని." కామసాని మాధవ్ కళ్ళల్లోకి చూస్తూ. "అదే నిజమయితే మనిద్దరం మొదటిసారి ఎప్పుడు కలుసుకున్నామో చెప్పు?" అన్నది.

మాధవ్ మాట్లాడలేదు.

"చెప్పవేం?" అన్నది కామసాని.

"ఏమో, గుర్తురావడంలేదు" అన్నాడు మాధవ్.

కామసాని నిరాశ చెందినట్లుగా ఒక్కసారి కౌగిలిని విడిపించి దూరంగా జరిగింది.

"సోమూ! నేను చెపుతుంటేనే గుర్తుకొస్తున్నది. లేకుంటే గుర్తుకు రావడంలేదు. ఔనా?"

"ఔనౌను. సరిగ్గా అంతే!" అన్నాడు మాధవ్.

"అయ్యో- ఎంత కష్టం వచ్చింది నాకు?"

కామసాని నిట్టూర్చింది.

"సోమూ! జ్ఞాపకం తెచ్చుకో బాగా. గణపతి దేవులవారు నిన్ను స్వయం భూమందిరంలో పద్మాకార శిల్పాల నిర్మాణంలో ప్రవేశపెట్టారు. నీవు తదేక దీక్షతో శిల్పంలో లీనమైవున్నావు.

మిగిలిన శిల్పులు తమ జీతపు మాడలు చేతిలో పడటమే లక్ష్యంగా పెట్టుకొని మొగసాలలోని గడియారం ఎప్పుడు గంటలు కొడుతుందా అని ఎదురుచూచేవాళ్ళు.. కాని నీలో రాత్రింబవళ్ళ తేడా

లేకుండా, రాయిలో రాయివై, శిల్పం కోసమే పుట్టినట్లు శిలలలో కరిగి కరిగి లీనమైపోయేవాడివి.

అనాడు సాయంత్రం ప్రదోషసమయంలో అమ్మగారు స్వయం భూదేవాలయ పూజకు వచ్చారు. వెంట కుమార్తెలు రుయ్యమ్మగారూ, ముమ్మడమ్మగారూకూడా వున్నారు.

ఆనాడు కార్తీక సోమవారం!

వెంట పళ్ళాలు పట్టుకొని దాస దాసీ జనం వచ్చారు.

అమ్మగారికి అటుపక్క మా అమ్మ చామకాంబా, ఇటు పక్క నేనూ నిలబడి వున్నాము.

అంతా ఆలయంలోకివెళ్ళి బిల్వపత్రాలతో స్వయంభువును పూజించాము.

పూజ ముగిసింది.

ఇంకా పూర్తిగా చీకటి పడలేదు.

"చామక్కా! స్వామివారి సేవకై ఒక గర్భనృత్యం చెయ్యి" అని రుద్రమ్మగారు మా అమ్మను అడిగింది.

మా అమ్మ స్వయం భూకల్యాణమంటపంలో పాత్రగొండ్లి అభినయిస్తున్నది.

మా అమ్మ నృత్యానికి రాణీవాసా, రాజకుమార్తెలూ పరవశం చెందిపోతున్నారు.

నేను కొంచెంసేపుచూచి, మంటపంనుండి ఇవతలికి వచ్చాను.

నాకెందుకో ఆలయంలోని కొత్త నిర్మాణం చూడాలనిపించి ఆలయం వెనుకకు వెళ్ళాను.

వరుసగా ఒక్కొక్కమూర్తినీ చూస్తూ ముందుకు నడిచాను.

ఆశ్చర్య!!

నీ వొక పద్మాకార శిల్పంమీద తల ఆనించి ఆకాశం వంక చూస్తూ కూర్చున్నావు. గుర్తొస్తున్నదా సామీ?"

"ఆఁ- ఆఁ!"

"నీ చూపు మామూలు మానవుల చూపులాగాలేదు. ఏదో దివ్య వీక్షణమది. స్వర్గలోకంలోని ఇంద్రుని సుందర మందిర శిల్పాన్ని చూస్తూ, దానిని భూలోకంలో స్వయం భూమందిరంలోకి దింపాలని

ప్రయత్నిస్తున్నట్లుగా వుంది ఆ చూపు. సోమూ! నేను వచ్చి నీకు కొంచెందూరంలో కూర్చున్నాను.

"ఏయ్ ఎవరు నువ్వు?" అని గట్టిగా రెండు మూడుసార్లు పిలిస్తేనే కాని నీవీ లోకంలోకి రాలేదు.

తపోభంగంచేసిన అప్సరసవైపు ముని చూచినట్లు నీవు నా వైపు చూచావు.

సోమూ గుర్తుందా??

ఆనాడు ముంగర, కమ్మలు, భవిరెలు అలంకరించుకొని వున్నాను. శ్రావణ్నియ చీరెకట్టి,వాయియేఘపు రవిక తొడుక్కొన్నాను. కాంచీమాపురం కదులుతూవుండగా, నేను లేచినిలబడి ఓ నృత్య భంగిమలో నిన్ను ప్రశ్నార్థకంగా చూచాను.

నీవు నన్నప్పుడు విచిత్రంగా చూచావు.

ఓహో! ఏమి చూపు సోమూ! ఎన్ని జన్మలకూ మరచి పోలేని చూపు!

అప్పుడు మన మధ్య జరిగిన సంభాషణ గుర్తుందా?"

"గుర్తు రావడంలేదు దేవీ...."

"అయితే విను-" కామసాని ఏదో చెప్పబోయింది. చెప్ప బోతూ చెప్పబోతూ తటాలున అదృశ్యమైంది. మాధవ్ నివ్వెరబోయి గడియారం చూచుకున్నాడు. పదిహేను నిమిషాలై పోయింది.

# 8

మళ్ళీ పూర్ణిమ వచ్చింది.

మాధవ్ ముందు కామసాని ప్రత్యక్షమై కథ చెప్పడం మొదలు పెట్టింది-

"సోమూ! ఆ నాడు నిన్ను చూచిన తొలినాడు నేను పులకించి పోయాను."

"ఏయ్, ఎవరు నువ్వు?" అని ప్రశ్నించాను.

నీవు బదులు పలుకకుండా నా వంక చూస్తూ వూరుకున్నావు.

"ఎందుకిట్లా ఏకాంతంలో కూర్చున్నావు?"

జవాబులేదు.

"మహారాణివారు పుత్రికాపరివార సహితంగా శివార్చనకు వస్తున్నారట। నీవేదో ఇక్కడ కూర్చున్నావు."

ఈ మాటకు కంగారు పడ్డావు.

లేవబోయావు,

నేనే ఆపాను.

"ఇంకా రాలేదులే- రాబోయేప్పుడు ముందు చెపుతాను. ఇంతకూ నీవెవరు?"

"భళ్ళాళ సోమేశ్వరుడు నా పేరు. శిల్పం నా వృత్తి."

"ఏం చేస్తున్నావిక్కడ?"

"పద్మాలు చెక్కుతున్నాను."

"ఏ శాస్త్రం ఆధారంగా?"

"మీకు శిల్ప శాస్త్రం తెలుసా?" ఎదురు ప్రశ్న వేశావు.

"కొంచెం.... కొంచెం."

"భరతాన్ని అభినయాన్ని శిల్పం కింద మారుస్తున్నాను. ఈ పద్మాలకవతల దీపలక్ష్మి శిల్పం చూడండి. ఆ పక్కనే స్థానక, చాది, రేచక, అంగహార, కరన, ప్లవన భ్రమరాది విన్యాసాలు వరుసగా గోడ మీద ఎలా చెక్కుతున్నానో"

సోమూ। నీవు చెపుతున్నది నిజమే। నాట్య శాస్త్రాన్ని శిలలలో నిక్షిప్తం చేస్తున్నావు. నేను నివ్వెరపోయాను. ఎందుకంటే సోమూ। మా అమ్మ చామకాంబకు కూడా తెలియని కొన్ని శాస్త్ర, రహస్యాలు అప్పుడే శిల్పం కిందకి పరివర్తన చేశావు.

అందులో కొన్ని భంగిమలు మాత్రం మా అమ్మ. నాకు అప్పటికే నేర్పించింది. దానిని బట్టి నేనూహించాను, నీ శిల్పానికీ ముఖానికీ బొత్తిగా సంబంధంలేదని గ్రహించాను.

నీవు చూడడానికి అతి సామాన్యంగా వున్నావు.

కానుంటే అందంగా వున్నావు కలల కంటున్న కళ్ళతో.

నీ కళ్ళలో అంత శాస్త్రం దాగివుందా?
నీ మనసు ఇన్ని అభినయ రహస్యాలను మదించిందా?
ఎప్పుడు?
ఈ జన్మలోనేనా!?
నీవు మాత్రం వెర్రిబాగుల వాడిలా పద్మాని కంటిపెట్టుకొని కూర్చున్నావు.
నీ ముఖం చూస్తుంటే నాకెందుకో తమాషా పట్టించాలని పించింది.
"ఊఁ! ఆలయ పూజారులు అమ్మవారి రాకముందు నీకు చెప్పలేదా, ఇక్కడ ఉండ కూడదని?"
"తెలియదు. నేనిక్కడ వున్నట్టు పూజారులు చూడలేదేమో!"
"మంచిది. నేను చెపుతున్నాను కదా ఇప్పుడు".
"మీరు....?"
"నేను ఇందులూరి అన్నయ్యగారి సోదరిని!"
నీవప్పుడు భయంతో వణికిపోయావు సోమూ! ఇందులూరి అన్నయ్యగారి మేధాశక్తి చూచి రుద్రమదేవి అప్పటికే తన కుమార్తె రుయ్యమ్మగారిని అన్నయ్యకిచ్చి వివాహం చేయాలని నిశ్చయించు కున్నది. ఈ విషయం అందరికీ తెలిసిపోయింది. నీకు కూడా తెలుసు కాబట్టే భయపడ్డావని గ్రహించాను,
వినయంగా నమస్కరించి వెళ్ళబోయావు.
పోనీయకుండా అడ్డం నిలిచాను-
"నేను నీతో మాటాడాలి కూర్చో."
"నాతోనా!" భయంతో అన్నావు.
"అవును, నీతోనే."
"అన్నయ్యగారి సోదరీ మణులు మీరు. నా బోటి సామాన్యునితో మాటాదేందుకేముంటుంది?"
"ఉన్నది...."
నీవు నా వేపు ప్రశ్నార్థకంగా చూచావు.

ఆ చూపులో అనుమానం, భయం, అమాయకత్వం.

"చూడు, నీ పేరు సోమేశ్వరుడన్నావు కదూ! నిన్ను నేను సోమూ- అని పిలుస్తాను. సోమూ! మా సోదరులు రుయ్యమ్మగారిని ప్రేమిస్తున్నారు. కాని మా కులం వేరూ, రాణి గారి కులం వేరు. అలాంటిది ఈ ప్రేమ ఫలిస్తుందంటావా? ఈ వివాహం చేయవచ్చునంటావా?"

"అమ్మాయిగారూ! ఇవన్నీ చాలా చాలా పెద్ద పెద్ద విషయాలు. నేను చాలా చిన్నవాణ్ణి. వీటిని చర్చించేందుకు తగను."

"కావచ్చు. కాని నాకు నీ అభిప్రాయం కావాలి. అంటే ఈ విషయాల గూర్చి మా రాజధానిలో సామాన్యుడు ఏమనుకుంటున్నాడో వినాలని మా అభిప్రాయం."

"అలా అయితే మీరు భోజరాజులా మారు వేషం వేసుకుని సంచారానికి వెళ్ళండి. అంతేకాని ఇందులూరి అన్నయ్యగారి చెల్లెలు వచ్చిందంటే మాత్రం ఎవరూ చెప్పడానికి సాహసించరు!"

నీవు చెప్పిన మాటకు నేను అప్రతిభురాలనైనాను.

"నీకు తగిన పారితోషికం ఇస్తాను. చెప్పు?" అన్నాను నేను.

నీవు నవ్వావు. ఆ నవ్వులో ఏదో తిరస్కారం వుంది. అభినయ శాస్త్రం తెలిసిన నేను నీ మనో భావాలను ముఖ దర్పణంలో తేలికగానే పోల్చుకున్నాను.

"ఏం మాడలంటే నీకంత నిర్లక్ష్యమా?"

"కాదు. కాని మాడల కోసమే అన్ని పనులూ చేయలేను నేను. ఉదాహరణకు ఈ శిల్పాలు చెక్కడం-ఇది మా నాయనగారు గుండయ్యగారి ఆజ్ఞతోనో గణపతిదేవుల వారి ఆజ్ఞతోనో చేస్తున్నానని అనుకోవద్దు. నాలో తెలియని ఏదో తపన ఇలా రాళ్ళను చెక్కుతుంటేనే కాని తీరడం లేదు. అందుకే ఈ చెక్కడం."

"ఏమిటీ! మల్యాల గుండయ్యగారు మీ నాయనగారా?"

"అవును."

ఇప్పుడు ఆశ్చర్య పడటం నా వంతయింది. సోమూ! నిన్ను

ఆట పట్టిద్దామని నేను ఇందుటూరి అన్నయ్యగారి చెల్లెలినని అన్నాను. కానీ తీరా నీవు గుండయ్యగారి కొడుకుననే సరికి అప్పుడు నాకు భయం పట్టుకుంది. గుండయ్యగారి శక్తి నాకు బాగా తెలుసు. రుద్రమ్మదేవిగారికి అన్నయ్య గారు మేధా స్థానమయితే గుండయ్య గారు కుడిచెయ్యి.

సోమూ!

అప్పుడు నీవు వివరంగా నా బాల్యాన్ని గూర్చి, శివాచార్యుల వారు నీ శిల్పాన్ని ప్రశంసించి రాజధానికి తీసుకురావడం గూర్చి నాకు చెప్పావు.

సోమూ! నీవు మాటాడుతుంటే రాతికోటపైన గిజిగాడు ముక్కుతో గూడు అల్లుతున్నట్లుంది.

ఏకశిలలోని సంపెంగ తోటలో హరిణాలు గడ్డి పరకలు కొరికినట్లుంది.

భద్రకాళి చెరువులో హంసలు సుతారంగా నడుస్తున్నట్లుంది.

సోమూ! గుర్తుందా ఇదంతా?"

"ఆఁ- ఆఁ! గుర్తొస్తున్నది."

"అలాగా! సంతోషం. అయితే అప్పుడేం జరిగిందో చెప్ప గలవా?"

"చెప్పలేను."

కామసాని నిట్టూర్చింది. కొంచెం ఆగి మళ్ళీ చెప్పసాగింది.

"బాగా గుర్తుకు తెచ్చుకో. అప్పుడు ఆలయానికి ప్రదక్షిణం చేస్తూ అమ్మగారూ, అమ్మాయిగార్లూ, మా అమ్మ అటు వచ్చారు. నిన్నూ నన్నూ చూచారు. ఆలయపూజారి వణికి పోయాడు.

అప్పటికి బాగా చీకటిపడింది.

గుడిలో రత్న దీపాలు వెలిగాయి.

ఆముదపు ప్రమిదల కాంతితో రత్నాలు గుడిని పట్టపగలు చేస్తున్నాయి.

"ఎవరితడు?" రాణీగారు ప్రశ్నించారు.

కాగడాలు పట్టుకున్న చెలికత్తెలు సమీపానికి వచ్చారు.

నీ గూర్చి, పూజారి భయపడుతూ, భయపడుతూ చెప్పాడు.

"సోమేశ్వరుడు ఇక్కడ వున్నాడని నాకు తెలియనే తెలియదు మహారాణీ! అపరాధం మన్నించండి."

మహారాణి నావైపు చూచింది.

అప్పుడామె స్త్రీ వేషంలోనే వున్నారు. పీతాపట రవిక, మర కత పట్టుచీరె ధరించి వున్నారు.

నీవు రాణీగారికి నమస్కరించావు.

మల్యాల గుండయ్యగారికీ, నీకూగల అనుబంధాన్ని పూజారి రాణీగారితో చెప్పాడు.

"అలాగా!" అని రుద్రమదేవి చిరునవ్వు నవ్వారు.

ఆమె ముఖాన దరహాస చంద్రిక వికసించడంతో నా లోపలి భయాంధకారం పారిపోయింది.

"ఏయ్ పిల్లా! ఏం చేస్తున్నావిక్కడ?" రాణీగారు నన్ను చూచి ప్రశ్నించారు.

"ఇక్కడేదో విచిత్ర శిల్పవిన్యాసంవుంటేనూ, చూస్తున్నాను" మెల్లి మెల్లగా అన్నాను.

"ఏదీ విచిత్ర శిల్పవిన్యాసం? ఈ సోమేశ్వరుడేనా?" రాణీగారు ఆ మాట అనగానే నా గుండె ఝల్లుమంది.

సోమూ! రాణీగారు ఏ ముహూర్తాన ఆ మాట అన్నారో కాని నీవే నాబతుకుకొక విచిత్ర శిల్పవిన్యాసానివైనావు.

రాణీగారు ముందుకు సాగారు.

వెంటనే ముమ్మడమ్మగారు-

రుయ్యమ్మగారు-

మా అమ్మ-

చెలికత్తెలూ-

పూజారీ—

నేనూ వారివెంట వెళ్ళిపోయాను.

ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు.

నీవు చెక్కుతున్న బొమ్మలగూర్చే ఆలోచిస్తూ పడుకున్నాను.

తెల్లవార్లూ ఏవేవో కలలు.

నేనూ అభినయంపట్టి నిలుచున్నట్లు-

నీవు ఉలితో నన్ను శిలలో నిక్షేపిస్తున్నట్లు-

సోమూ!

ఆ తర్వాత తరుచు నేను ఆలయానికి వచ్చేదాన్ని-

నిన్ను పలకరించేదాన్ని.

ఇలా కొన్నాళ్ళు జరిగాయి.

కాలంతోబాటు నా వయస్సూ పెరిగింది.

మనస్సుతోబాటు మమతా పెరిగింది.

శిల్పిగా నీ పేరూ పెరిగింది.

ఒకనాడు నీవు నన్నడిగావు-

"కామసానీ! ఆనాడు నన్నెందుకు భయపెట్టావు, నీవు ఇందులూరి అన్నయ్యగారి చెల్లెలినని?"

"నీవు చెప్పలేదా- గుండయ్యాగారి కొడుకునని?"

"ఔను. గుండయ్యాగారికి నా మీద పితృ ప్రేమవుంది"

"అలాగే అన్నయ్యగారికీ నామీద సోదరి ప్రేమవుంది." అని నేను నవ్వాను.

"అన్నయ్య- రుయ్యమ్మల ప్రణయం ఫలించింది" అన్నాను నేను.

కావాలనే నేనాసంభాషణ మొదలుపెట్టాను.

"అలాగా!" అన్నావు నీవు

"ఔను. అన్నయ్య బ్రాహ్మణుడు. అతడు, ఎంత రాజకుమార్తె అయినా రుయ్యమ్మను చేసుకోవడం సంభావ్యం కాదని కొన్ని వర్గాలు వ్యతిరేక ప్రచారం మొదలుపెట్టాయి. మూడులక్షల సైన్యంతోవచ్చి ముట్టడించికూడా పరాజయంపొంది పారిపోయిన దేవగిరి యాదవ

మహాదేవరాజే ఈ అరాజకం సృష్టిద్దామని ప్రయత్నిస్తున్నాడని ఓ వార్త!

అయితే విశ్వేశ్వర శివాచార్యులవారు ఈ వివాహాన్ని సమర్థించారు. "రుయ్యమ్మ వీరశైవదీక్ష స్వీకరించింది. అన్నయ్యకూ దీక్షను ఇస్తాను. దీక్ష స్వీకరించిన వెంటనే ఆయన తన బ్రాహ్మణ కులాన్ని కోల్పోతాడు. రుయ్యమ్మ అన్నయ్యలు వీరశైవ కులస్థులవుతారు. వారిది శివకులం, శివగోత్రం. సర్వకులాలకన్నా శ్రేష్ఠమైన స్వయంభూ కులం" అన్నాడు. అని విశ్వేశ్వర శివాచార్యులవారు బసవేశ్వరుని కన్నడవచనం ఒకటి చదివారు. ఆ వచనానికి అర్థమేమంటే-

"కాచగ కమ్మరి, ఉతికిన చాకలి
నేయసాలె వేదమ్మన జాపడు
కర్మచేతనే కులభేదమ్ములు
కులీను దొక లింగస్థుడేకదా!"

ఆ తర్వాత శివాచార్యులవారు రుద్రమదేవికి మరొక వచనం చదివి వినిపించారు.

"డోహర కక్కయదే గోత్రమ్మో
మేదర చెన్నయదే గోత్రమ్మో
భక్తులైన మనదెల్లర దొకటే
ప్రభువగు సంగమదేవుని గోత్రము"

రుద్రమదేవి ఈ వచనాలు విని నవ్వింది.

"శివాచార్యా! మీరు దైవాంశసంభూతులు. మీతో నేను తత్వ విషయాలలో వాదించలేను. మా బసవయ్యగారి కన్నడవచనాలు విన్పించారు. ఎందుకంటే ఇది కులాంతర వివాహంకాబట్టి. కాని ఇక్కడ జరుగుతున్నది అనులోమ వివాహం! మనది శ్రౌతశైవం, బసవయ్యది లింగాయత శైవం. కేవలం నా సంతృప్తికోసమే మీరిలా అంటున్నారు"అన్నారు మహారాజే.

"శ్రేత శైవంలో అన్నయ్య- రుయ్యమ్మల వివాహాన్ని నిషే ధించే సూత్రాలేమీ లేవేః" అన్నారు శివాచార్యులు చిరునవ్వుతో.

రుద్రమదేవి మాట్లాడకుండా తలవంచుకుంది.

"సోమేశ్వరా! త్వరలో మన ఏకశిలలో కల్యాణపీఠలు మ్రోగ బోతున్నాయి" అన్నాను నేను.

అదివిని నీవు నవ్వావు.

"నాకీ విషయం తెలుసు కామసానీ! కల్యాణవేదికా నిర్మాణా నికై నాకు ఆజ్ఞవచ్చింది" అన్నావు.

"అలాగా! నాతో చెప్పలేదేః" అన్నాను.

"చెప్పనిస్తేనా- నీవే చెపుతున్నావు వచ్చినప్పటినుంచి" అన్నావు.

కొంచెంసేపు ఊరుకోని-

"ఈ పెళ్ళిపై నీ అభిప్రాయం ఏమిటిః" అని అడిగాను.

"పెద్దవారి పెళ్ళి. నా అభిప్రాయం ఏముందిః" అన్నావు.

"అలా కాదు. రుయ్యమ్మ. అన్నయ్యనెందుకు ప్రేమించిందిః"

"ఏంః అన్నయ్య రుయ్యమ్మను ప్రేమించాదేమో!" అన్నావు నీవు.

నేను సిగ్గుపడ్డాను.

నీవే అన్నయ్యవైనట్టూ, నేనే రుయ్యమ్మనైనట్లూ, నాలో నేను కొన్ని క్షణాలు ఊహించాను.

"ఇది కేవలం ప్రేమవివాహమని నేను అంగీకరించను. కొంతవరకూ వీరశైవ వివాహం. మరికొంతవరకూ రాజకీయ వివాహం" అన్నావు నీవు.

"అంటేః" అని అడిగాను నేను.

"అంటే.... అన్నయ్యగారు మహామేధావి. ఈ వివాహం తరువాత ఆయన మహారాణీగారివద్ద అల్లుడుగాకాక ప్రధానమంత్రిగా వుండవచ్చు. అన్నయ్య ప్రభావంతో కొన్ని చుట్టుపక్కల రాజ్యాలు మన కాకతీయ సామ్రాజ్యంతో మైత్రి నెరపుతాయి" అన్నావు నీవు.

అదివిని, నేను నివ్వెరపోయాను.

సోమూ! నిజంగా నీవంతటి రాజకీయతంత్రాన్ని ఎలా ఊహించగలిగావు?

నేను కాదుగదా, మా అమ్మ చామకాంబకూడా ఊహించలేని విషయమది!

"ప్రేమించి పెళ్ళిచేసుకోవడం మంచిదా?-

పెళ్ళి చేసుకొని ప్రేమించడం మంచిదా?"

అని అడిగాను నేను.

"ప్రేమ, పెళ్ళి రెండూ వేరు వేరు పదాలుకావు. ఒకటే!" అన్నావు నీవు.

"ఎలా?" అని నేను ప్రశ్నించాను.

"మనస్సూ, బుద్ధీ, ఆత్మా-ఎప్పుడు మనం మరొకరితో లీనం చేస్తామో, అదే ప్రేమ. ఆ రకంగా లీనం చెయ్యడానికి పెళ్ళి తోడ్పడుతుంది.

ఒకవేళ ఆ రకంగా ముందే లీనమైతే పెళ్ళి ఆ తాదాత్మ్యానికి అధికార ముద్రనిచ్చి శరీరాలనుకూడా కలిపేందుకు తోడ్పడుతుంది" అన్నావు నీవు.

"ఇలా నీవెక్కడ చదివావు?" అన్నాను నేను.

"చదువా! నేనెప్పుడు చదివాను?"

"మరి ఎలా చెపుతున్నావు?"

"ఇది చెప్పడానికి చదువెందుకు? మనస్వితచాలు."

"అయితే సోమేశ్వరా! నీవెప్పుడయినా, ఎవరినైనా ప్రేమించావా?" అసలు సంభాషణలోకి దింపాను.

"ఆఁ- ప్రేమించాను" అన్నావు నీవు.

నా గుండె గుభేలుమంది.

"రాణివాసం పిల్లనా?"

"కాదు కొండపిల్లను"

"కొండ పిల్లలెవరున్నారు ఏకశిలలో?.... మైలసంతనాడు అడవులనుండి కొండలనుండివచ్చిన ఎవతెనైనా చూచావా?"

"వాళ్ళుకాదులే...." అని కొంచెం ఆగావు.

"ఆ పిల్లపేరేమిటో?" అనుమానంగా అడిగాను.

"గిరిజ" అని నవ్వుతూ నీవు చెప్పావు.

"గిరిజ....గిరిజ...." అని మనస్సులో రెండు మూడుసార్లు అనుకున్నాను.

నాకిక నీ దగ్గర కూర్చోబుద్ధి పుట్టలేదు.

చివాలున లేచాను, చక చకా నడిచాను.

"ఏయ్ పిల్లా!" అన్నావు నీవు, కాంచీనూపురం కదులుతూ పోతున్న నన్నుచూచి.

నేను నీవైపుచూచి ముక్కూ, మూతీ విరిచి సాగిపోయాను, జారుతున్న శ్రీవన్నియ పైటకొంగు సరిచేసుకొని- దూరంనుంచి నీవు నవ్వుతున్న శబ్దం నాకింకా ఇప్పటికీ చెవులలో మారు మోగుతూనే వుంది-

"సోమూ! నీకింత మతిమరుపు ఎలా వచ్చింది సోమూ? "

"ఆ! తర్వాత ఏం జరిగింది?" మాధవ్ ఆసక్తితో ప్రశ్నించాడు.

"తర్వాత ఏక శిలకుపోయి గిరిజ అన్న పేరుగల ఆడపిల్లలు ఏకశిలలో, ఉప్పసిరవాడలో, పానుగంటివాడలో, బ్రాహ్మణవాడలో, మట్టివాడలో ఎక్కడవున్నారా-అని విచారించాను. మైలసంతకూ మడిసంతకూపోయి కొండలనుండి, కోనలనుండి వచ్చి వ్యాపారం చేస్తున్న ఆడవాళ్ళపేర్లన్నీ అడిగాను...."

"ఊ! తర్వాత?" మాధవ్ మళ్ళీ ప్రశ్నించాడు.

పదిహేనునిమిషాలు అయిపోయింది.కామసాని అదృశ్యమైంది.

# 9

మళ్ళీ పూర్ణిమ వచ్చింది. కామసాని కథ చెప్పడం మొదలుపెట్టింది.

"మా అమ్మ అక్కలవాడకుపోయి మాహుఠయ్యవద్ద మేనకా విశ్వామిత్రుల చిత్రాన్ని గీయించుకొని తీసుకొని రమ్మన్నది. చిత్ర

కారుడు మాహురయ్యగారింటికి పోయాను. మాహురయ్య మంచి విద్వాంసుడు. అతని చేతిలోని మయ్యెర హంసరెక్కలాగా మెత్తగా వుండి విచిత్రమైన రంగులతో సృష్టికి ప్రతిసృష్టి చేస్తూండేది. ఆయన బొమ్మలు యవనదేశాలకూ దిమిష్కకూ కూడా మోటుపల్లిరేవు నుండి ఎగుమతి చేస్తుంటారని విన్నాను. మాహురయ్య మాకు చాలా కాలంగా తెలుసు. అతడు అస్థాన చిత్రకారుడు.

మాహురయ్య మంచి మాటకారి. ఆయన బొమ్మలలాగే ఆయనమాటలూ కళాత్మకంగా వుంటాయి.

"మాహురయ్యా! మా అమ్మగారు మేనకా విశ్వామిత్రుల బొమ్మగీయించి తీసుకొని రమ్మన్నది" అన్నాను.

"మీ అమ్మగారంటే. చామకాంబగారా? రుద్రమదేవిగారా?"

"కన్నతల్లే!"

"సంతోషం! అలాగే పదిహేను దినాలలో సిద్ధంచేస్తానమ్మా బొమ్మను"

"అన్నట్లు, మాహురయ్యా! నీవు కళాకారుడివికదా. గిరిజ అనే అందమైనపిల్ల ఎవరైనా నీ కళామందిరానికి వచ్చిందా?"

మాహురయ్య నవ్వాడు.

"రాతినుండి వచ్చిన ప్రతి అందమైన శిల్పమూ. గిరిజకాదా కామసానీ" అన్నాడు.

నేను నివ్వెరపోయాను.

సోమూ! నీవింత చమత్కారంగా మాట్లాడతావని ఊహించ లేకపోయాను.

నా మనస్సులోని బరువు దిగిపోయినట్లయింది.

ఇప్పుడు నా చుట్టూ వున్న చిత్రాలు నాకు ఇంతకు ముందు కన్నా అత్యంత సుందరంగా కనపడ్డాయి. మాహురయ్య చాలా పెద్ద చిత్రకారుడు. ఆయన చేతికింద దాదాపు యాభై మంది కళాకారులు పనిచేస్తున్నారు.

"నేను మీ చిత్రశాలను చూడవచ్చా?" మాహురయ్యను అడిగాను. పూర్వం ఎప్పుడో చూశాను అతని చిత్రాలు. అప్పటికి మళ్ళీ కొత్త చిత్రాలు వచ్చివుండవచ్చు. "నిరభ్యంతరంగా" అని వెంటవచ్చి చిత్రాలు చూపించసాగాడు మాహురయ్య.

మాహురయ్య చిత్రశాల చాల పెద్దది. వసారాలో కుడ్యాలంకారచిత్రాలే వందకుపైగా వున్నాయి. సింహద్వారంవద్ద మాహురమ్మ చిత్రంవుంది. మాహురమ్మ అతని ఇలవేల్పు. ఉపాసనాదైవంకూడా కావచ్చు. మాహురమ్మ నగ్నదేవత. అయితే, చిత్రకారుడు తన చాతుర్యంతోదేవత యొక్క నగ్నత్వాన్ని చిత్రంలో మెరుగు పరిచాడు. మాహురమ్మచిత్రాని కవతల మైలారదేవుని చిత్తరువు వుంది. అవతల కారభైరవుని చిత్రం, చాముండేశ్వరి చిత్రం, వీరభద్రుని చిత్రం, స్వయం భూదేవుని నిలువెత్తు శైలచిత్రం, ఆ పక్కనే పద్మాక్షీదేవి చిత్రం వున్నాయి.

ఒక్కొక్క చిత్రాన్నే చూస్తూ లోపలి గదిలోకి వెళ్ళాను. అక్కడ కాకతీయ వైభవాన్ని ప్రతిబింబించే చిత్రాలు వున్నాయి. ముందుగా చంద్రుని బొమ్మవుంది. ఆ చంద్రజ్యోత్స్న, కిరణాలు కిరణాలుగా, రేకులు రేకులుగా విరిసి భూమిపైకి జారుతున్న దృశ్యం.

కాకతీయులు చంద్ర వంశస్థులన్న సూచన ఎంతో కళాత్మకంగా చేశాడు మాహురయ్య ఇందులో. తరువాత మొదటి చేతరాజు, ప్రోలరాజు, రెండవ చేతరాజు, రెండవ ప్రోలరాజు, రుద్రదేవుడు, మహాదేవుడు, గణపతిదేవుడు, రుద్రమదేవి చిత్రాలు వరుసగా వున్నాయి. అమ్మగారి చిత్రం మాత్రం పురుష వేషంలోనే చిత్రింపబడివుంది. వెనుక నేపథ్యంగా ఓరుగంటి భూమి కోటవుంది. కోటకివతల రుద్రమదేవి శక్తి స్వరూపిణిగా నిలబడివుంది. ఆమె చిత్రానికి పక్కన రేఖలుగా తోమారమూ, కౌక్షేయకము, ముసుందయము, కార్ముకము, గద, కుంతము, పట్టసములు చిత్రింపబడి వున్నాయి. ఆమె పాదాల వద్ద నేపథ్యంలో నలుపు తెలుపు రంగులలో పట కుటీ

రములు చిత్రింపబడ్డాయి. బల్లాకి పెట్టెలు, పల్లకీలు మోసుకొనే బోయీల వరుసలు చిత్రం అట్టడుగున కన్పడీ కన్పడకుండా చిత్రింప బడివున్నాయి. అమ్మగారిలోని రణచండికాతత్వాన్ని అందులో చిత్ర కారుడు ఆవాహన చేశాడని గ్రహించాను. అన్నీ తైలవర్ణ చిత్రాలే. మాహుంరయ్య చేతికింద పనిచేసే వారంతా జీతగాళ్ళేకాదు. నాగవాపి నుండి, మోటుపల్లి నుండి, భట్టిప్రోలు నుండి చిత్రకళా విద్యార్థులు వచ్చి మాహుంరయ్య వద్ద బొమ్మలు నేర్చుకుంటున్నారు. ఇటీవల చీనా దేశం నుండి కూడా ఒక చిత్రకళా విద్యార్థి వచ్చాడట! అతడిని ఎన్నో పరీక్షలకు గురిచేసి చారులను నిరంతరం వెంటవుండేటట్లుచేసి మాహుంరయ్య వద్ద ప్రవేశపెట్టారట గణపతి దేవులవారు.

మాహుంరయ్య నావెంటవస్తూ రంగుల గూర్చి, చిత్ర రహస్యాల గూర్చి వ్యాఖ్యానిస్తున్నాడు.

"కామసానీ! నీ నాట్యంలో హస్తముద్రికలు మాట్లాడినట్లే మా చిత్ర శాలలో రంగులు మాట్లాడుతాయి. ఒక్కొక్క భావాని కొక్కొక్క రేఖ, ఒక్కొక్క రసానికి ఒక్కొక్క రంగు" అన్నాడు మాహుంరయ్య నవ్వుతూ.

ఇంకా లోపలి గదిలోకి తీసుకుపోయాడు. అక్కడ దేవతా చిత్రాలున్నాయి. కొన్ని నిర్మాణంలోనూ, కొన్ని అమ్మకానికి సిద్ధంగా వున్నాయి.

తారాచంద్రుల చిత్రమూ, గోపీకృష్ణుల చిత్రమూ నేను పోయే టప్పటికి చిత్రకారుల చేత లిఖింపబడుతున్నాయి. మాహుంరయ్య వారికి కొన్ని సూచనలు ఇచ్చాడు. గోడనిండా శివుని చిత్రాలే. శివుని అరవై నాలుగు లీలలూ, అరవై నాలుగు చిత్రాలుగా గీయబడి వున్నాయి.

"ఇవన్నీ అమ్మకానికేనా?" అడిగాను.

"ఏం కొంటావా?" అన్నాడు మాహుంరయ్య.

"ఏం కొనలేనా?" అన్నాను నేను.

"ఎందుకు కొనలేవు? నీవూ, మీ అమ్మా- ఆస్థాన నర్తకీ మణులు. చిత్రానికి పదివేల సువర్ణ నిష్కాలు అవలీలగా ఇవ్వగలరు" అన్నాడు.

అంటే నేను గీయమని అడిగిన చిత్రం వెల పదివేల సువర్ణ నిష్కాలని పరోక్షంగా చెప్పాడన్నమాట!

"అన్నీ ఇంతంత వెలలోనే వున్నాయా?" అన్నాను నేను.

"కాదు. రంగులను బట్టి, చిత్రంలోని నైపుణ్యాన్నిబట్టి వెల మారుతుంది. ఒక్కొక్క చిత్రం గీయడానికి ఆరు నెలల కాలం కూడా పడుతుంది నాకు." అన్నాడు మాహురయ్య.

మాహురయ్య ఇంకా చాలా చాలా విశేషాలు చెప్పాడు-

"ప్రభువులవారి ఆజ్ఞతో కోటకు రాజవంశ క్రమం చిత్రాలుగా గీచాను. ఇవి కాక దేవదాసీగణం తమ గృహాలంకరణార్థం కొన్ని చిత్రాలు గీయించుకున్నారు. మొన్న ఓ కర్ణాట వేశ్య నా చిత్రశాలకు వచ్చింది. 'ఏం బొమ్మలు కొంటావా?' అని అడిగాను.

'నేను బొమ్మలను కనడమే తప్ప, కొనడం లేదు' అన్నదామె చమత్కారంగా" అన్నాడు మాహురయ్య.

"ఛీ- పో! నీకు వయసు పెరుగుతున్నా చిలిపి మాటలు పోవడం లేదు" అన్నాను నేను.

"నేనేం తప్పు మాట అన్నాను? కనడం అంటే చూడడమే అని అర్థం" అన్నాడు మాహురయ్య.

"నీ ద్వంద్వార్థాలూ, కళా చాతుర్యాలూ నాకు తెలుసులే— పద అవతల గదిలో బొమ్మలు చూడనీ" అన్నాను నేను.

అయితే మాహురయ్య నన్ను అవతలి గదిలోకి పోనీయలేదు.

"అక్కడ వేరే బొమ్మలేమీ లేవు పద" అన్నాడు మాహురయ్య.

అయితే అతడి తొందరపాటుతనం చూచి అతడిది నటన అని నేను గ్రహించ గలిగాను.

"బొమ్మలు లేకపోతే ఏమున్నాయో చూడనీ?" అన్నాను నేను మొండిగా.

"చెప్పేది నీకు కాదూ! నీకు వయసు వచ్చినా, ఇంకా పసితనం పోలేదు—అది ఆంతరంగిక పూజా మందిరం. అందులోకి ఎవరూ పోకూడదు" అన్నాడు మాహూరయ్య.

"ఓహోయ్ మాహూరయ్యా! నీ దొంగమాటలు నాకు తెలుసు లేవోయ్! అక్కడేదో స్త్రీ కంఠస్వరం వినిపించింది నాకు. ఏం? నీ ఆంతరంగిక పూజా మందిరంలోకి కళా దేవత సాక్షాత్కరించిందా ఏమిటి? తలుపుతియ్! ఆదేవతను చూచి రుద్రమదేవి గారితో నీ గూర్చి చెపుతాను" అన్నాను నేను.

మాహూరయ్య గడగడ వణికి పోయాడు. నన్ను బుజ్జగించి సాగనంప బోయాడు.

"మాహూరయ్యా! కామసానిని లోపలకి రానీ" అన్న మాటలు విన్పించాయి పూజా మందిరంలో నుండి.

ఆ గొంతు గుర్తుపట్టాను

అది రుయ్యమ్మ గారిది.

అప్పుడు గజగజ వణికి పోవడం నా వంతు అయింది.

రేపో మాపో వివాహానికి సిద్ధంగా వున్న రుయ్యమ్మ ఇక్కడ ఈ మాహూరయ్య ఆంతరంగిక మందిరంలో వున్నదా?

"కామసానీ! ఇటురా." రుయ్యమ్మ నన్ను పిలచింది. మాహూరయ్య భయపడుతూ తలుపు తీశాడు.

"భయపడకు. ఈమెతో మనకు పని వుందిలే" అన్నది మాహూరయ్యతో రుయ్యమ్మ.

ఆ మాటతో మాహూరయ్య ముఖంలోని కలవరపాటు కొంత తగ్గింది.

నేను లోపలికి పోయాను.

రుయ్యమ్మ ఒక ఎత్తైన ఆసనం మీద కూర్చొని వున్నది.

సరిపట్టు రవికె, వాయుమేఘపు చీరె ధరించి వుంది. ఆమె పాదాల సమీపంలో కింది వరుసలో ఒక చిత్రకారుడు బొమ్మలు గీస్తున్నాడు.

నేను చిత్రాలు చూచాను.

అవి మహాభారత చిత్రాలు.

ఒకటి ధర్మరాజు జూదమాడుతున్న దృశ్యం.

రెండవది గీతోపదేశం.

రుయ్యమ్మ నన్ను పలుకరించింది.

నేను వచ్చిన పని చెప్పాను.

"అలాగా! నీతో ఒంటరిగా మాట్లాడాలని అనుకుంటున్నాను ఇంతలో నీవే వచ్చావు" అన్నది రుయ్యమ్మ.

"అమ్మాయి గారూ! ఇవేమిటి-పెళ్ళికి చిత్రాలా?'' అన్నాను నేను నవ్వుతూ.

రుయ్యమ్మ నన్ను అదోలా చూచింది. చూచి, ఆసనం నుండి లేచింది - లేచి నడువ సాగింది.

నేనామెను అనుసరించాను.

రుయ్యమ్మ చిత్రశాల పైభాగానికి వెళ్ళింది.

అది ఏకాంత మందిరం.

రుయ్యమ్మ కూర్చున్నది.

నేనూ కూర్చున్నాను.

"కామసానీ! నేనిక్కడికొక ముఖ్యమైన రాజకీయ కార్యం మీద వచ్చాను" అన్నది రుయ్యమ్మ.

'పెళ్ళికూతురుకు రాజకీయ కార్యమా?'

నేను విచిత్రంగా ఆమె వైపు చూచాను.

"నేను ప్రస్తుతం నీకు చెప్పే విషయాలు నీవు చామ కాంబతో కూడా చెప్పకూడదు తెలుసా?" ఆజ్ఞాపించినట్లు అన్నది.

"అలాగే'' అన్నాను నేను భయభక్తులతో.

"ప్రస్తుతం నా పెళ్ళి ఆగిపోయింది" అన్నది రుయ్యమ్మ.

నా నెత్తిని పిడుగు పడ్డట్లు అనిపించింది.

"అదేమిటి? అన్ని ఏర్పాట్లూ జరుగుతున్నాయి- అటు భళ్ళాల సోమేశ్వరుడు కల్యాణ మంటపం కూడా సిద్ధం చేస్తున్నాడే!" అన్నాను నేను అయోమయంగా.

"కావచ్చు - కాని మాది మామూలు వివాహం కాదుకదా! అందుకే మామూలుగా జరుగదు." అన్నది రుయ్యమ్మ.

మిగతా కథ

"ఆవాహన" రెండవ భాగంలో చదవండి.


విజయ

సెప్టెంబర్ నెల నవలానుబంధం

'ఆవాహన' (రెండవభాగం)

రచన:

డా॥ ముదిగొండ శివప్రసాద్.

VIJAYA AUGUST 1977 Regd. No. M. TN/M



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M132 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Soumya |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |